


సాహిత్య మాస పత్రిక

# 355

నవంబరు, 1983

వార్షిక చందా : పది రూపాయిలు

సంపుటి : 30, సంచిక

విడిప్రతి : ఒక రూపాయి

ప్రకాశకులు :

దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర

హైదరాబాదు

# స్రవంతి

## సాహిత్య మాస పత్రిక



సంపాదకులు :

**వేమూరి రాధాకృష్ణమూర్తి**

# ఈసంచికలో

సంపాదకీయం :

# ఆంధ్ర సభ స్వర్ణ జయంతి మహోత్సవం

దక్షిణ భారత హిందీ ప్రచార సభ 1918లో స్థాపించబడినది. మహాత్మగాంధీ గారు యీ సభకు అధ్యక్షులుగా వుండి యీ సంస్థను సక్రమమైన మార్గాన నడిపేందుకు ఎంత గానో సహకరించారు. వారి సమయంలోనే దక్షిణ భారతావనికి చెందిన తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ భాషల ప్రాతిపదికపై దక్షిణ భారత హిందీ ప్రచార సభకు నాలుగు ప్రాంతీయ శాఖలు ఏర్పాటు చేయడం, ఆయా భాషా రాష్ట్రాలలో జాతీయ భాషా ప్రచారం ప్రారంభించడం జరిగినది. ఆ రోజుల్లో మద్రాసు నగరం దక్షిణాది రాష్ట్రాలకు కూడలిగా వుండటం వల్ల అక్కడ దక్షిణ భారత హిందీ ప్రచార సభ ప్రధాన కార్యాలయం ఏర్పాటు చేశారు.

1936లో ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘం, అను పేరట విజయవాడలో ఆంధ్రశాఖ ప్రారంభించబడింది. కీ॥శే॥ దేశ భక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు యీ శాఖకు అధ్యక్షులుగా వుండి ఆంధ్రావనిలో జాతీయ భాషా ప్రచారం కావించేందుకు తోడ్పడ్డారు. ఆ తరువాత విశాలాంధ్ర ఏర్పడినప్పుడు ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచారసంఘం, దక్షిణభారత హిందీ ప్రచార సభ, ఆంధ్రగా రూపొందినది. హైదరాబాదులో ప్రధాన కార్యాలయం ఏర్పాటు చేయబడడం జరిగినది. 1986 నాటికి యీ ఆంధ్రశాఖ ప్రారంభమై 50సంవత్సరాలు పూర్తికానున్నది. కనుక 1986లో ఆంధ్ర శాఖ స్వర్ణోత్సవాలు జరుపవలెనని దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర శాఖ కార్యనిర్వాహకవర్గంవారు కీ॥శే॥ శీర్ల బ్రహ్మయ్య గారి అధ్యక్షతన జరిగిన సమావేశంలో నిర్ణయించారు. కీ॥ శే॥ శీర్ల బ్రహ్మయ్యగారు తన జీవిత సమయంలో యీ మహోత్సవాలు జరుగవలెనని ఎంతగానో కాంక్షించారు. అందుకై సాధ్య మైన పరిధిలో కార్యక్రమాలు రూపొందించారు. ఆ మహోత్సవాలలో పాల్గొన కుండానే శ్రీ బ్రహ్మయ్యగారు యీ మధ్యనే శాశ్వతంగా కన్ను మూశారు. వారి స్మృతి చిహ్నంగా యీ మహా సభల్ని విజయవంతంగా నిర్వహించి తీరాలని యీ మధ్యనే జరిగిన ఆంధ్ర శాఖ కార్య నిర్వాహక వర్గం నిర్ణయించడం ముదావహం,

ఈ మహోత్సవాల సందర్భంగా కొన్ని కార్యక్రమాలు నిర్ణయించబడినవి. హిందీ పరిచయ పరీక్ష నడిపించి రెండు లక్షల మందికి హిందీ బోధించడం, వారి కోసం ఒక పరీక్ష నడిపి అందు ఉత్తీర్ణులైన వారికి విజయ పత్రాల నందజేయడం మొదటి కార్యక్రమం. ఉత్తమమైన 10 తెలుగుగ్రంథాలను హిందీలోనికి అనువదింపజేసి ప్రకటించడం రెండవ కార్యక్రమం. హైదరాబాదులో గల సభా భవనంలో ఖాళీగా వున్నచోట సభ కార్యకర్తల కోసం భవన నిర్మాణం కావించడం మూడవ కార్యక్రమం. తెలుగు సంస్కృతీ సాహిత్య విశేషాలతోను, ఆంధ్రప్రదేశ్‌లో సభ పక్షాన విజయవంతంగా పనిచేస్తున్న హిందీ పండితుల సచిత్ర పరిచయాలతోను సావనీరు ప్రకటించడం నాలుగవ కార్యక్రమం. 1986లో మూడు రోజుల పాటు మహోత్సవాలు జరపడం, ఆ సందర్భంలో హిందీ పండితులను, సభ కార్యనిర్వాహక సమితి, ట్రస్టుబోర్డు సభ్యులను ఘనంగా సన్మానించడం అయిదవ కార్యక్రమం. హిందీ పరిచయ పరీక్షా కార్యక్రమం ప్రారంభించబడినది. రెండు తెలుగు కథానికల సంపుటాలు ఆంధ్ర కేసరి ప్రకాశంపంతులు గారి జీవిత చరిత్ర ప్రథమ భాగం సభ పక్షాన ప్రకటించడం జరిగినది. కార్యకర్తల భవన నిర్మాణానికి కూడా అవసరమైన కృషి ప్రారంభమైనది. యిందుకు ఆంధ్రప్రదేశ్‌లో జాతీయ భాషా ప్రచార రంగంలో నిష్ఠతో పనిచేస్తున్న 10,000 మంది హిందీ పండితుల సహకారం ఆంధ్ర సభకు లభిస్తుందని విశ్వసిస్తున్నాము.



# నిరీక్షణం

—తిరునగరి

ఒయాసిస్సు లింకిపోతున్నాయి
ఎడారులే మిగిలిపోతున్నాయి
మధుర వసంతాలు పోయాయి
విధుర హేమంతాలు మిగిలాయి

ఇక ఈ జీవిత వృక్షం
కిసలయిస్తుందా ?
ఆకు రాల్చిన కొమ్మల్ని
ఒక వసంతం ఆశేషిసుందా?

ఏమిటో మరుభూమిలా వికృతంగా, బోసిగా కన్పించే ఈ భూమి
ఒక శ్రావణ వర్షాగమంతో పచ్చపచ్చగా సస్యకేదారాల రమణీయ
వసుమతిగా మారిపోదేమి?

మనిషి గళాన మణిహారాలు కైసేసిన కాలం నిన్న
మనిషి గళాన కత్తులు భయంకరంగా మెరుస్తోన్న కాలం నేడు

ఆత్మీయంగా, అన్యోన్యంగా శుభ్రజ్యోత్స్నా హృదయాలతో
బ్రతుకుల్ని పండించుకున్న కాలం గతం
మనుగడల్ని వెలిగించుకున్న కాలం గతం
అసూయగా, ఆవేశంగా మనుషుల్ని మనుషులు పాశవికంగా
కరుస్తోన్న విషోరగాలు
విచ్చలవిడిగా సంచరిస్తోన్న కాలం నేడు
జ్వలిస్తోన్న కతులూ కార్పణ్యాల ఆహవ భీభత్సం నేడు

ఎగసి ఉప్పొంగుతున్న మనిషి విజ్ఞాన ధార
ఎడదలోని కిలుషును కడగివేయలేక పోతున్నది

అణువును బద్దలు కొట్టిన మనిషి మేధస్సు
అసలు మనుగడ పరమార్థాన్నే తెలుసుకోలేక పోతున్నది
చరిత్ర మొదలైన నుంచీ
పేదవాని వెన్నెముక బాణంలా వొంగుతూనే ఉన్నది
ఉన్నవాని మేడపై అంతస్తుపై అంతస్తు ఆదేపనిగా లేస్తున్నది
తరతరాల శోకం అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తూనే ఉన్నది
ఇంకెన్నడు ఇంకెన్నడు ఈ ధరిత్రికి శుభవేళ రానున్నది ?
ఈ విజ్ఞాన కేళికా మందిరంలో
బట్టలు విప్పిన కేబరే ప్రదర్శనల ఒంపుసొంపుల్ని నేను చూడ
దలచుకోలేదు

మానవత నాచ్ఛాదించుకొని
మంచిని గుండెలో వెలిగించుకొని
జగద్వీథిలో ఠీవిగా, అందంగా దేవతల్లా
నడచి వచ్చే
మనుష్యుల కోసం
మంచి కాలాలకోసం నేను నిరీక్షిస్తున్నాను
నవోదయం కోసం
నవజీవనం కోసం
నేను మేల్కొని చూస్తున్నాను

"కవితా సదనం"
పోచమ్మవాడ
ఆలేరు (ఎస్. సి. రైల్వే)
నల్గొండ జిల్లా ఎ. పి.
508 101

# గాజుగ్లాసులు

పంజాబీ మూలం -అమితోజ్

పడిపోయిన వెంటనే పగిలిపోవడానికి
మనం గాజుగ్లాసులం కాము
నేస్తం ! మనం మిత్రులం

మొట్ట మొదట
మనం ఒకరినొకరం చూసుకోవడం మానేస్తాం
తర్వాత -
క్రమక్రమంగా విడిపోతాం
ఇట్లా విడిపోవడం మనను బాధిస్తుంది
- నాకు తెలుసు
కానీ పడిపోయిన వెంటనే పగిలిపోవడానికి
మనం గాజు గ్లాసులం కాము

తెలియని తలుపుల్ని మళ్ళీ మళ్ళీ తట్టడం
తెలిసి తెలిసీ శ్వాస నాపుకోడం
ఒక్క వ్యక్తి కోసం నిరీక్షణలో

కూడలిలో నిలబడడం
ఎంత బాధాకరమో నీకూ నాకూ తెలుసు
లేదు — మనమిట్లా చేయడానికి వీల్లేదు
.........వీల్లేదు

నువ్వెక్కడికో వెళిపోతావు
'నేనిక్కడ క్షేమంగా ఉన్నాను
భగవంతుడు నిన్ను చల్లగా చూడాలి,
అని ఓ ఉత్తరం రాస్తాన్నేను.
జవాబివ్వడం ఆలస్యం చేసి

అందుకు క్షమాపణ కోరుతావు నువ్వు
నీ పెళ్ళైన సంవత్సరానికి
నేన్నిక్కో 'మంచి బహుమతి' పంపుతాను
'మీ నాన్న చనిపోయినందుకు
బాధగా ఉంది' అని జవాబు రాస్తావు నువ్వు

తర్వాత -
క్రమక్రమంగా అప్పుడొస్తుంది
ముప్పై ఒకటో డిసెంబర్ చల్లని సాయంకాలం
ఆ వేళ ఎక్కడో ఓ పోస్టాఫీసులో
మన గ్రీటింగ్ కార్డ్స్ కలుసుకుంటాయి

నాకు తెలుసు -
ఇట్లావిడి పోవడం మనను బాధిస్తుంది
కాని - పడిపోయిన వెంటనే పగిలిపోవడానికి
మనం గాజు గ్లాసులం కాము.

తెలుగు అనువాదం — వేణుగోపాల్

3-12-4/4
కుమారపల్లి
హనుమకొండ, 506 001.

# వేగిదేశము

— పైడిపాటి సుబ్బరామశాస్త్రి

విష్ణు స్వరూపిణి కృష్ణాస్రవంతి య
దేశమ్ము సాగర దీప్తిగాంచు
మిఱుమిట్లునా గౌత మీగంగ యే దేశ
సవిధమ్ము కడలితో సరసమ్మాడు
"అనఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వర విధాన
పుణ్య సమృద్ధమై పొలుచు" నే దేశమ్ము
తీర్థమై, క్షేత్రమై, దివ్యులకును
ఆ ప్రదేశమ్ము, భారతమందు, కడు ప్ర
శస్తి గాంచెను వేగి దేశమ్ము పేర
పూర్వపుణ్యంపు వడపోత, పుట్టువొందు
టట్టి పూతంపు ధాత్రిని నాంధ్రమందు

# పురుష్ కా మూల్య

క్షేత్రానికి ధర ఉంది,
మేడకుధర ఉన్నది,
చింతపండుకూ
మిరపకాయలకూ
కుంకుడుకాయలకూ,
ధర ఉన్నది,
ఇక లేనిదల్లా
పురుషుడు రచించిన
నవలకు !

మారుతినగర్
విజయవాడ, 520 004

# అంతర్మథనం

—జీవన్

మనసు పాల సముద్రాన్ని
మథిస్తున్నారు ఆశల దేవ దానవులు
మరీ మరీ లేచి పడుతున్నాయి
మమతల మాయ కెరటాలు
అడుగడుగునా అవతరిస్తున్నాయి
ఆశయాల సుడిగుండాలు
మధ్య మధ్య విజృంభిస్తున్నాయి
ఇంద్రియ గ్రాహాలు.
ఆగ్రహంతో చేస్తున్నాయి విన్యాసాలు
చుట్టూ కొట్టుక వస్తున్నవి
జీవితంలో మరుగున పేరిన
బురదల నురుగులు.
పాపం ! అల్లకల్లోలమైన
మనోసాగరంలో
కుదురుగా నిలవలేక
కూరుకుపోతున్నది ఆత్మ కూర్మం

మందరం అంతా మందిరంలో
మందిలో ఉన్నా
మనసు నిలవక బజారున
పడతాడు మనిషి
యుగాలు మారినా - జగాలు తీరినా
సెగలతో పొగలరవరవలతో
భుగభుగలతో
అతనిలో పుట్టేదీ - పెరిగేదీ
అదే కాలకూటం
అతడెపుడూ అంతే -
గాలివాటం.
ఆదినుంచి అంతం వరకూ నిరంతరం
అదుపులేని మథనంతో మరుగుతోంది
హృదంతరం
అంతులేని ఈ అంతర్మథనం ఆగే దెన్నడో
మరి అమృతోద్భవం జరిగేదెన్నడో

— జి. వి. ఎన్. ఎన్. శాస్త్రి
తెలుగు పండిట్
M.Z P.H. స్కూలు
వేళంగి,
కాకినాడ తాలూకా.
తూ. గో. జిల్లా - 533 260

# జీవితం

—డా॥ మాధవరావు రేగులపాటి

జీవితం చలన బిందువు
అందుకే ముందుకు నడుస్తుంది
అప్పుడప్పుడు వెనక్కు కూడ

జీవితం చలన బిందువు
అందుకే అది సరళరేఖ
కాదంటే వక్రరేఖ

జీవితం అగ్గిపెట్టె అంచు
అందుకే దాని మీద
ఏదో రాపిడి జరుగుతుంది

జీవితం అగ్గి పుల్ల
అందుకే అప్పుడప్పుడు
భగ్గున మండుతుంది.

జీవితం ప్రాచీముఖాన
పూచిన రాగ ప్రసూనం
స
కురుస్తుంది
సందేహపు పొరలను చీలుస్తుంది.

జీవితం మానవతా గర్భంలో వెలసిన
జ్యోతి
అందుకే
యుద్ధాల దరిద్రాల చీకటి సముద్రాల
ఆవలి గట్టును చూస్తుంది

జీవితం ప్రభంజనం
అందుకే
అశాంత అతృప్త మానస పారావార
తరంగాన్ని
ఎదురుతుంది; పైకి ఎగురుతుంది.

జీవితం ఒక ద్రవం
అందుకే సురాసురుల సముద్రమథనం
నుండి పుట్టే అమృతం
అప్పుడప్పుడది హాలాహలం.

జీవితం ఒక వచనం
జీవితం ఒక పద్యం.
అందుకే దానికి నిర్వచనం లేదు
అందుకే ఇంకా వాచకంగా మిగిలి ఉంది

సుబేదారి
వరంగల్ 506 010

# పురిటిపాటలు

-చిగిచెర్ల కృష్ణారెడ్డి ఎం. ఏ.

మానవ జీవితంలో స్త్రీకి పురుషునితో సమానమైన ప్రాతినిధ్యంవుంది. జానపద జీవితంలో స్త్రీ పాత్ర అనితర తుల్యమని చెప్పవచ్చు. కష్ట నష్టాలకు ఓర్చుకొనే శక్తి జానపద స్త్రీకున్నంతగా నగరాల్లో నివసించే స్త్రీకి ఉండదు. అన్ని పనుల్ని చేసుకుంటూ అత్త మామల్ని వినయ విధేయతలతో గౌరవిస్తూ ఆడపడుచుల్ని అభిమానంతో ఆదరిస్తూ మరిది గార్లను మక్కువతో చూచుకుంటూ. భర్తకు అనురాగాన్ని అందిస్తూ తన కష్టాల్ని మరచిపోతుంది. సంతానం కావాలనే ఆరాటం పురుషుని కంటే స్త్రీకి ఎక్కువ. తల్లి కావాలనే ఆవేదన జానపద స్త్రీలో మరింత ఎక్కువగా కన్పిస్తుంది. అందుకే సంతాన హీనురాలైన స్త్రీ ప్రతి చెట్టును. పుట్టను పూజిస్తూ. వ్రతాలు నోములునోస్తూ, మంత్ర తంత్రాలతో సంతానం కలుగుతుందనే నమ్మకంతో ఆశతో ఎదురు చూస్తుంది. సంతాన హీనురాలైన స్త్రీకి జానపదుల్లో గౌరవం లేదు. చిన్నదానికి పెద్దదానికి గొడ్రాలితనాన్ని ఎత్తి చూపుతుంటారు.

గర్భంధరించి తొమ్మిది నెలలు నిండి, నొప్పులు రావడం జరిగినపుడు ఆ నొప్పులు గొడ్రాలికి తెలిసేవి కావు అటూంటారు. ఆ బాధ అనుభవైక వేద్యమన్నమాట. ప్రసవించడమంటే మళ్ళీ జన్మ ఎత్తడంతో సమానం. కొద్ది మంది ప్రసవ సమయములో మరణించడం కూడా జరుగుతుంటుంది.

కష్టనష్టాల్లో ఆదుకొనేగుణం జానపదులకున్నంతగా నగర వాసులకుండదు. ఎదుటి వాళ్లు బాధ పడుతుంటే ఆ బాధ తమకే వచ్చిందా అన్నంతగా ఆరాటపడిపోతారు. అంత ఆర్ద్ర హృదయం వాళ్లది. ప్రసవ సమయంలో నొప్పులు ప్రారంభంకాగానే అన్నిపనులు వదలి పెట్టి చుట్టు ప్రక్కల స్త్రీ లందరూ చేరిపోతారు. ప్రసవ సమయంలో చేయాల్సిన పనుల్లో తీసుకోవలసిన జాగ్రత్తల్లో నైపుణ్యం వున్న వాళ్ళు కొందరుంటారు. ఆ సమయంలో అలాంటి వాళ్లపై తప్పక ఆధారపడతారు. వారినే జానపదులు 'మంత్రసానులు' అని వ్యవహరిస్తారు.

ప్రసవ వేదన సమయంలో స్త్రీ తన బాధను మరచిపోవడానికి, ఆమె మనసును మళ్ళించడానికి నారాయణ శతకము. భాగవతము రామాయణం లాంటి గ్రంథాలను చదవడం ఉంటుంది. గర్భస్థుడైన ప్రహ్లాదుడు నారదుని ద్వారా నారాయణ మంత్రాన్ని వినడం వల్లనే పరమ భాగవతుడుగా తయారయ్యాడని మనవాళ్ల నమ్మకము. అందువల్లనే గర్భిణీ స్త్రీ మనసు ఆహ్లాదంగా ఉండాలని తీరని కోరికలేవీ ఉండకూడదని అంటారు. ఫలహారాలు వండి పెట్టడంలోని పరమార్థమే ఇది.

కొన్ని ప్రాంతాల్లో ప్రసవ సమయంలో బాధపడుతున్న స్త్రీ మనసును మళ్ళించడానికి కాబోలు ఇతర స్త్రీలు పాటలు పాడటం ఉంది. ఆ పాటలు వింటుంటే ఎంత కఠిన హృదయమైన ద్రవించి పోతుంది. పాట పాడుతున్న స్త్రీ కళ్ళల్లో వింటున్న వాళ్ళ కళ్ళల్లో కన్నీళ్ళు కాల్వలు గట్టడం చూడవచ్చు. అంత అర్థవంతంగా ఉంటాయా పాటలు. ఆ సమయంలో నీళ్ళు చిప్పిల్లడానికి కారణం

ఇది అని చెప్పలేము. గతంలో వాళ్ళ బాధలు. అపురూపమైన వాళ్ళ అనుభవాలు, తీయటి మధుర స్మృతులు, సంతానంపై ఉన్న ప్రేమ, ఒక ప్రాణికి జన్మ నివ్వడంలో ఉన్న తృప్తిపడిన కష్టాలు. అన్నీ కలగాపులంగా హృదయాన్ని కదిలించి వేస్తాయి. ఆ స్పందనలో మనసు ఆర్ద్రమైపోతుంది. పాటల్ని వాటిలోని అంశాల్ని గమనిస్తే అవి దుఃఖ పూరితంగా వున్నాయని చెప్పడానికి వీల్లేదు. కాని వింటున్నప్పుడు కఠినశిలలు కూడ కరగిపోతాయేమో అనిపిస్తాయి ప్రసవవేదన పడుతున్న స్త్రీతో పాటు పాడుతున్న స్త్రీ. వింటున్న వాళ్ళు అందరూ బాధను పంచుకోవడం కన్పిపిస్తుంది. నేను ఈ గేయాల్ని సేకరిస్తున్నపుడు పాటవినిపిస్తున్న స్త్రీ కళ్ళలో నీరు కారడం, ఆమె గొంతులో ధ్వనించే ఆవేదన, ఆమె ముఖంలో తాండవించే తన్మయత్వాన్ని చూసి ఆశ్చర్యపోయాను.

ఉత్తమ సంతానం కోసము ఉర్విళ్ళూరే తల్లిమనసు పుట్టబోయే బిడ్డను గూర్చి ఎన్నియోకలలు గంటుంది. నందీశుడు, భూదేవుడు, సుక్కల్లో చంద్రుడు, సంగమేశుడు, ఆదినారాయణ-ఈ దేవుళ్ళను ప్రశంసించడం తనకు పుట్టబోయే బిడ్డ అంతటివాడు కావాలనే ఆశకు తార్కాణంకావచ్చు. సుబ్బారావుపేట[1]లో సేకరించిన ఈపాటలో సంగమేశ్వరుని ప్రశంసించడం గమనించదగింది. సుబ్బరావుపేట సమీపంలో సంగమేశ్వర ఆలయం వుంది.

సోమవారము 'కలాగంటి' [2]
సోమవారము కలాగంటి
సామీనీ పదగంటి
కలగంటినో దేవా కలగంటినో
యీ కష్టములు కడతేర్చెవారెవరూ
మంగులారము కలాగంటి
మంగులారము కలాగంటి
మానందీసుని పదగంటి
యీ కట్టములు[3] కడ తేర్చె వారెవరూ.

ఈ సందర్భములో పాడే పాటల్లోనే బిడ్డ పుట్టడం లోని వివిధ దశల్ని వర్ణిస్తూ పాడే గేయాలు కొన్ని ఉన్నాయి. నొప్పులు ఎక్కువవుతుంటే మనసులో మాత్రము కడుపులోశిశువు ఎలాంటిగుర్తులతో ఉండాలో ఊహించుకొంటూ బాధను మరచి పోవడానికి ప్రయత్నిస్తుంది. చిన్నవయసులో గర్భంధరించాను అంటూ నారాయణుని వేడుకుంటుంది. క్రిందిపాటలో కడుపులో బిడ్డ బయటికి వచ్చే దృశ్యాన్ని తూర్పు దిక్కున అప్పుడే ఉదయిస్తున్న బాల భానునితో పోల్చడం జానపదుల వర్ణనా వైచిత్రికి తార్కాణం. విష్ణువుకు సంబంధించిన స్వరూప వర్ణన చేయడంలో తన కొడుకూ అంతటి వాడుకావాలని అలాంటి గుర్తులతో పుట్టాలని ఆశించడం ఉంది.

పల్లవి :

తల తాల పిండాము కలకాల నొప్పులు
యెక్కొచ్చె సూరునికి యేకదండముసామి
కాసి గుడ్డల దాననయా నారాయణసామి
కాపాడు పసి బాలనూ.

నెత్తినా కిరీటముకల వాడె బాలునికి ॥యెక్కొచ్చె॥
నాలిక నచ్చ త్రముకలవాడె బాలునికి ॥యెక్కొచ్చె॥
భుజాన భూచక్రాలు కలవాడె బాలునికి ॥యెక్కొచ్చె॥

1. ధర్మవరం తాలూకా అనంతపురం జిల్లా. ఈ వ్యాసంలోని గేయాల్ని పాడి వినిపించింది మాదిగ వీరమ్మ. (50 సం॥లు)
2. కల కన్నాను.
3. కష్టాలు.

చేతిలో చక్రాలు కలవాడె బాలునికి ॥యెక్కొ చ్చె॥
బొడ్డునా చింతామణికలవాడె బాలునికి ॥యెక్కొ చ్చె॥
అరికాల దామిరలు కలవాడె బాలునికి ॥యెక్కొ చ్చె॥

పుట్టబోయే బిడ్డను గూర్చి తల్లికనే కలలేగాక బయటి ప్రపంచానికి రావడానికి బిడ్డపడే ఆరాటం కూడా ఈ గేయాల్లో కన్పిస్తుంది. ఉదాహరణకు :

"మూడేసి నెలలాయె మా తల్లి గర్భంలో
ముద్దయ్యి నిలిచుంటినో లింగయ్యా
నాలుగేసి నెలలాయె మా తల్లి గర్భంలో
నీవు సూత్రా లేర్పడెనో లింగయ్య
అయిదేసి నెలలాయె మాతల్లి గర్భంలో
ఆవిసీలు[1] పోసిండె చెమ్మయ్య
యింకన్న యేమి గతయ్య ముందు నాగతి
యేమయ్యా లింగయ్యా
ఆరేసి నెలలాయె మా తల్లి గర్భంలో
అరటి పండంటినో లింగయ్యా
యేడేసి నెలలలాయె మా తల్లి గర్భంలో
యలక పండంటినో లింగయ్య
యెనిమిదేసి నెలలాయె మాతల్లి గర్భంలో
దాల్చి[2] పండంటినో లింగయ్యా
తొమ్మిదేసి నెలలాయె మా తల్లి గర్భంలో
తొడలపై జోగ్గాడనో లింగయ్యా
పూదుగడ్డేసి వుగ్గులోన[3] చేత
మా వూరికే నన్పంపు లింగయ్యా
వూరికే పంపుమని వడిగితే బాలుడా
నీకు తల్లులెందరు తనియా లెందరూ
తల్లి వక్కెటెగాని తనియా లెందరో నేనెరగ
దండము రచ్చించు తప్పులు మన్నించు
వుక్కు అంగసముతో పాదసాదమని
'పాలేరు' దాటించు లింగయ్యా
నీలసీలమని 'నీలేరు' దాటించు బాలుడే బయి వెల్లానే
మాయి మంత్రసాని మరి 'పోతులూరమ్మ'
బొడ్డు మిందదుద్దులే కోసింది.

ఈ పాటలో క్రమ క్రమంగా పెరుగుతున్న పిండం లోని వివిధ దశల్ని చక్కగా వ్యక్తం చేయడం కన్పిస్తుంది చివరకు పండు లాంటి పిల్లాడు పుట్టడం 'మంత్రసాని' బొడ్డు కోయడం జరుగుతుంది.

సామాన్యంగా శరీరానికి కానీ, మనసుకుకాని బాధ కల్గినపుడు 'అబ్బ-అమ్మ' అనే పదాలు మొదట నోటి ను డి వెలువడతాయి. కానీ ప్రసవవేదన పడుతున్న స్త్రీ నారాయణుని స్మరించాలట. కానీ అబ్బ అమ్మ అనే పదాలనే నాలుక అందుకుంటుంది. అప్పుడు ప్రక్కనున్న స్త్రీలు దేవుణ్ణి తలచుకోమని సూచిస్తారు. ఈ అంశాలు కూడా పాటల్లో చోటు చేసుకున్నాయి.

ఉదా.

అమ్మమ్మ అంటుంది
అబ్బబ్బ మంటుంది
నారాయనన లేదురా రామా
నారాయనన లేదురా
యిరుగు పొరుగు వారొచ్చి
యిమ్ముగా కదిలొచ్చి
నారాయన ననమనిరో
నారాయన ననే 'శవదము'[4]
నాతి సెవనబడి
తల పత్రి వుదయించె రామా

1. ఆయుష్షు
2. ద్రాక్ష
3. బిడ్డపుట్టిన తరువాత సాంబ్రాణి పొగవేయడం వుగ్గు. అంటే చల్లనీలు చముదుకలిపి పిల్లలకు పట్టిస్తారు.
4. శబ్దము.

తల పత్రి వుదయించిన
'అరగెడి[1] యసేపు బాలుడె బయిలెల్లె'

పై గేయా లాధారంగా ఇతి వృత్తానికి సంబంధించి ఇటీవల చలన చిత్రం 'ముద్దమందారం'లోని కొన్ని పాటలు[2] సన్నివేశాలు చాలా దగ్గరిగా కన్పిస్తాయి. గుంపులోని స్త్రీలు కొంత మంది ప్రసవ వేదన పడు తున్న స్త్రీని చూసి, ఇంక దగ్గరకు వెళ్ళకూడదు అని నిర్ణయించుకుంటారట. ఇదే విషయాన్ని "ఇలాంటి బాధ నేనెరగమ్మ...అలా అయివుంటే అతని మొగమే చూడనమ్మా" అని కృష్ణశ్రీగారు తెలియ జేశారు. మానవమన స్తత్వ పరిశీలనకిది చక్కని ఉదాహరణ. ఆవేశంలో మానవుడు ఎన్నో చేయాలని అనుకుం టాడు. అది ఆ సమయములో మాత్రమే. క్రమంగా కాలంతోపాటు తీసుకొన్న నిర్ణయంలో కూడా బలం తగ్గిపోతుంది. నిజానికి స్త్రీ ప్రసవించడం మరో జన్మ ఎత్తడమన్న మాట.

స్త్రీల పాటల్లో కరుణ రసానికి ఆలవాలమైన ఇలాంటి పాటలెన్నో ఆట్టడుగునపడి ఉన్నాయి. వాటి సేకరణలో ప్రచురణలో ఇంత వరకు కృషి జరుగ లేదు. స్త్రీల ఊహలకు భావనాశక్తికి ఈ పాటలు నిద ర్శనాలుగా నిలుస్తాయి. ఆ సన్నివేశ సంబంధమైన దృశ్యాన్ని మనకళ్ళకు కట్టినట్లుగ ఈ పాటలు తెలియ జేస్తా యనడంలో సందేహంలేదు.

ఎదుటి వాళ్ళ బాధను చూసి స్త్రీ ఓర్చుకోలేక పోతుంది. తనకే ఆ కష్టం కలిగినట్లుగా కన్నీరు కారు స్తుంది. కాని పురుషుని హృదయం కఠినమైందంటారు. స్త్రీ హృదయం బాధలకు కరిగి కన్నీళ్ళుగా ప్రవ హిస్తుంది. పురుషుడు కన్నీళ్ళు కార్చడు. అంత మాత్రాన అతనికి బాధలేదని కాదు.

జానపద సాహిత్యంలో కన్నీళ్ళు నింపే గేయా లుగా ఇవి ప్రధానంగా కన్పిస్తాయి. కానీ ఈ బాధ శారీరక మైందేకాని మానసిక మైందికాదు.

ఈ గేయాలకు ఎలాంటి వాయిద్యాలుండవు. గేయం పాడుతున్న స్త్రీ గతాన్ని కలబోసుకొని ఒక ప్రక్క వెక్కివెక్కి ఏడుస్తుంటే మరొక వంక గుంపులోని స్త్రీలు గతాన్ని గుర్తు తెచ్చుకొని 'గొనుగుళ్ళు' మొదలు పెడ్తారు ఏడ్చేవాళ్ళు ముక్కు చీదడం. గర్భిణీ స్త్రీ బాధతో మెలికలు తిరుగుతూ కాళ్ళూ చేతుల్ని కదలిస్తూ చేసే చప్పుళ్ళు, ఇతర స్త్రీలు ఆమెను ఓదార్చడం ఇవన్నీ ఆ గేయంచుట్టూ ఉండే వాయిద్యాలు. అలాంటి వాతావరణంలో పాడే ఈగేయాల్లో గర్భం నుంచి శిశువు తల్లి గర్భం నుంచి ఎలా బయట పడ్తుందో అనే విష యం కూడా గేయాల్లోనే కన్పిస్తుంది. జానపద సాహి త్యంలో మాత్రమే ఈ పాటలు ప్రముఖ స్థానాన్ని వహించాయి. నాగరిక స్త్రీలలో ఇలాంటి అంశాలు కన్పించవు. అందుకే ఇలాంటి పాటలు శూన్యం.

జానపద సాహిత్యంలో మొట్ట మొదటిగా డాక్టరేట్ పట్టాన్ని తీసుకొన్న ఆచార్య బిరుదు డా బి. రామరాజు గారు, 'స్త్రీల పాటలు' అనే శీర్షికలో ఈ విషయాన్ని కొంత వరకు చర్చించారు.[3] కాని ప్రత్యేకంగా 'అనంతపురం మండలంలోని స్త్రీల పాటలు' అన్న విషయం పరిశోధించినవారు డాక్టర్ జి. యస్. మోహన్. మిగిలినవాళ్లు అక్కడక్కడ కొంత తెలియ

1. అర్ధగంట (30 నిIIలు)
2. జోలాలి నాయినా ఒకటాయె, రెండాయె లాలి మొII వి.
3. తెలుగు జానపద గేయ సాహిత్యం

చేతిలో చక్రాలు కలవాడె బాలునికి ॥యెక్కొచ్చె॥
బొడ్డునా చింతామణికలవాడె బాలునికి ॥యెక్కొచ్చె॥
అరికాల దామెరలు కలవాడె బాలునికి ॥యెక్కొచ్చె॥

పుట్టబోయే బిడ్డను గూర్చి తల్లికనే కలలేగాక బయటి ప్రపంచానికి రావడానికి బిడ్డపడే ఆరాటం కూడా ఈ గేయాల్లో కన్పిస్తుంది. ఉదాహరణకు :

"మూడేసి నెలలాయె మా తల్లి గర్భంలో
ముద్దయ్యి నిలిచుంటినో లింగయ్యా
నాలుగేసి నెలలాయె మా తల్లి గర్భంలో
నీవు సూత్రా లేర్పడెనో లింగయ్యా
అయిదేసి నెలలాయె మాతల్లి గర్భంలో
అవిసీలు[1] పోసిండె చెమ్మయ్య
యింకన్న యేమి గతయ్యా ముందు నాగతి
యేమయ్యా లింగయ్యా
ఆరేసి నెలలాయె మా తల్లి గర్భంలో
అరటి పండంటినో లింగయ్యా
యేడేసి నెలలలాయె మా తల్లి గర్భంలో
యలక పండంటినో లింగయ్యా
యెనిమిదేసి నెలలాయె మాతల్లి గర్భంలో
దాల్చి[2] పండంటినో లింగయ్యా
తొమ్మిదేసి నెలలాయె మా తల్లి గర్భంలో
తొడలపై జోగ్గాడనో లింగయ్యా
వూదుగడ్డేసి వుగ్గులోన[3] చేత
మా వూరికే నన్నంపు లింగయ్యా
వూరికే పంపుమని వడిగితే బాలుడా
నీకు తల్లులెందరు తనియా లెందరూ
తల్లి వక్కతెగాని తనియా లెందరో నేనెరగ
దండము రచ్చించు తప్పులు మన్నించు
వుక్కు అంగసముతో పాదసాదమని
'పాలేరు' దాటించు లింగయ్యా
నీలనీలమని 'నీలేరు' దాటించు బాలుడే బయి వెల్లానే
మాయి మంత్రసాని మరి 'పోతులూరమ్మ'
బొడ్డు మిందదుద్దులే కోసింది.

ఈ పాటలో క్రమ క్రమంగా పెరుగుతున్న పిండం లోని వివిధ దశల్ని చక్కగా వ్యక్తం చేయడం కన్పిస్తుంది చివరకు పండు లాంటి పిల్లాడు పుట్టడం 'మంత్రసాని' బొడ్డు కోయడం జరుగుతుంది.

సామాన్యంగా శరీరానికి కానీ, మనసుకుకాని బాధ కల్గినపుడు 'అబ్బ-అమ్మ' అనే పదాలు మొదట నోటిను డి వెలువడతాయి. కానీ ప్రసవవేదన పడుతున్న స్త్రీ నారాయణుని స్మరించాలట. కానీ అబ్బ అమ్మ అనే పదాలనే నాలుక అందుకుంటుంది. అప్పుడు ప్రక్కనున్న స్త్రీలు దేవుణ్ణి తలచుకోమని సూచిస్తారు. ఈ అంశాలు కూడా పాటల్లో చోటు చేసుకున్నాయి.

ఉదా.

అమ్మమ్మ అంటుంది
అబ్బబ్బ మంటుంది
నారాయనన లేదురా రామా
నారాయనన లేదురా
యిరుగు పొరుగు వారొచ్చి
యిమ్ముగా కదిలొచ్చి
నారాయన ననమనిరో
నారాయన ననే 'శవదము'[4]
నాతి సెవనబడి
తల పత్రి వుదయించె రామా

1. ఆయుష్షు
2. ద్రాక్ష
3. బిడ్డపుట్టిన తరువాత సాంబ్రాణి పొగవేయడం వుగ్గు. అంటే చల్లనీలు చమురుకలిపి పిల్లలకు పట్టిస్తారు.
4. శబ్దము.

తల ప్రతి వుదయించిన
'అరగెవి[1] యసేపు బాలుడె బయిలెల్లె'

పై గేయా లాధారంగా ఇతి వృత్తానికి సంబంధించి ఇటీవల చలన చిత్రం 'ముద్దమందారం'లోని కొన్ని పాటలు[2] సన్నివేశాలు చాలా దగ్గరిగా కన్పిస్తాయి. గుంపులోని స్త్రీలు కొంత మంది ప్రసవ వేదన పడు తున్న స్త్రీని చూసి, ఇంక దగ్గరకు వెళ్ళకూడదు అని నిర్ణయించుకుంటారట. ఇదే విషయాన్ని "ఇలాంటి బాధ నేనెరగమ్మ...అలా అయివుంటే అతనిమొగమే చూడనమ్మా" అని కృష్ణశ్రీగారు తెలియ జేశారు. మానవమనస్తత్వ పరిశీలనకిది చక్కని ఉదాహరణ. ఆవేశంలో మానవుడు ఎన్నో చేయాలని అనుకుం టాడు. అది ఆ సమయములో మాత్రమే. క్రమంగా కాలంతోపాటు తీసుకొన్న నిర్ణయంలో కూడా బలం తగ్గిపోతుంది. నిజానికి స్త్రీ ప్రసవించడం మరో జన్మ ఎత్తడమన్నమాట.

స్త్రీల పాటల్లో కరుణ రసానికి ఆలవాలమైన ఇలాంటి పాటలెన్నో ఆట్టడుగునపడి ఉన్నాయి. వాటి సేకరణలో ప్రచురణలో ఇంత వరకు కృషి జరుగ లేదు. స్త్రీల ఊహలకు భావనాశక్తికి ఈ పాటలు నిద ర్శనాలుగా నిలుస్తాయి. ఆ సన్నివేశ సంబంధమైన దృశ్యాన్ని మనకళ్ళకు కట్టినట్లుగ ఈ పాటలు తెలియ జేస్తా యనడంలో సందేహంలేదు.

ఎదుటి వాళ్ళ బాధను చూసి స్త్రీ ఓర్చుకోలేక పోతుంది. తనకే ఆ కష్టం కలిగినట్లుగా కన్నీరు కారు స్తుంది. కాని పురుషుని హృదయం కఠినమైందంటారు. స్త్రీ హృదయం బాధలకు కరిగి కన్నీళ్ళుగా ప్రవ హిస్తుంది. పురుషుడు కన్నీళ్ళు కార్చడు. అంత మాత్రాన అతనికి బాధలేదని కాదు.

జానపద సాహిత్యంలో కన్నీళ్ళు నింపే గేయా లుగా ఇవి ప్రధానంగా కన్పిస్తాయి. కానీ ఈ బాధ శారీరక మైందేకాని మానసిక మైందికాదు.

ఈ గేయాలకు ఎలాంటి వాయిద్యాలుండవు. గేయం పాడుతున్న స్త్రీ గతాన్ని కలబోసుకొని ఒక ప్రక్క వెక్కివెక్కి ఏడుస్తుంటే మరొక వంక గుంపులోని స్త్రీలు గతాన్ని గుర్తు తెచ్చుకొని 'గొనుగుళ్ళు' మొదలు పెడ్తారు ఏడ్చేవాళ్ళు ముక్కు చీదడం. గర్భిణీ స్త్రీ బాధతో మెలికలు తిరుగుతూ కాళ్ళూ చేతుల్ని కదలిస్తూ చేసే చప్పుళ్ళు, ఇతర స్త్రీలు ఆమెను ఓదార్చడం ఇవన్నీ ఆ గేయంచుట్టూ ఉండే వాయిద్యాలు. అలాంటి వాతావరణంలో పాడే ఈగేయాల్లో గర్భం నుంచి శిశువు తల్లి గర్భం నుంచి ఎలా బయట పడ్తుందో అనే విష యం కూడా గేయాల్లోనే కన్పిస్తుంది. జానపద సాహి త్యంలో మాత్రమే ఈ పాటలు ప్రముఖ స్థానాన్ని వహించాయి. నాగరిక స్త్రీలలో ఇలాంటి అంశాలు కన్పించవు. అందుకే ఇలాంటి పాటలు శూన్యం.

జానపద సాహిత్యంలో మొట్ట మొదటిగా డాక్టరేట్ పట్టాన్ని తీసుకొన్న అచార్య బిరుదు డా బి. రామరాజు గారు, 'స్త్రీల పాటలు' అనే శీర్షికలో ఈ విషయాన్ని కొంత వరకు చర్చించారు.[3] కాని ప్రత్యేకంగా 'అనంతపురం మండలంలోని స్త్రీల పాటలు' అన్న విషయం పరిశోధించినవారు డాక్టర్ జి. యస్. మోహన్. మిగిలినవాళ్లు అక్కడక్కడ కొంత తెలియ

1. అర్ధగంట (30 ని॥లు)
2. జోలాలి నాయినా ఒకటాయె, రెండాయె లాలి మొ॥ వి.
3. తెలుగు జానపద గేయ సాహిత్యం

జేశారు. అనంతపురం జిల్లా జానపద గేయాలపై సంపూర్ణమైన పరిశోధన ఇంత వరకు జరుగలేదు. ఆచార్య తూమాటి దోణప్ప కొన్నింటిని సేకరించారు.[1]

వాళ్ళు ఏర్పరచిన దారిలో ప్రయాణం చేస్తూ మరుగున పడివున్న, అదృశ్యమైపోతున్న ఇలాంటి అమూల్య రత్నాల్ని వెదకి వెలికి తీయడానికి కొంత మందైనా ముందుకు వస్తారని ఆశిస్తూ ఈ వ్యాసాన్ని ముగిస్తున్నాను-

**ఉపయుక్త గ్రంథ సూచి :**


1 తెలుగు జానపద గేయసాహిత్యం రామరాజు బి.

2. అనంతపుర మండలం స్త్రీల పాటలు మోహన్ జి. యస్.

3. జానపద కళాసంపద-దోణప్ప టి.

4. బాలల గేయ సాహిత్యం-దేవకి యం. కె.

5. గ్రామీణ సంస్కృతి (అముద్రితం కృష్ణారెడ్డి) (అనంతపురం జిల్లా-జానపద గేయం)


నాకు ఈ వ్యాసం తయారు చేయుటంతో తగిన సలహాలు నొసంగిన డాక్టర్ యం. కె దేవకి (ఆంధ్రోపన్యాసకులురాలు, ఆంధ్ర భారతి, శ్రీకృష్ణ దేవరాయ విశ్వ కళా పరిషత్తు, అనంతపురం) గారికి నా నమస్కారాలు.

—o—

పులివెందుల
కడపజిల్లా.

1. జానపద కళాసంపద (ప్రథమభాగం).

# వాత్సల్య రసాంబుధి సూర్‌దాస్

—డా॥ అన్నపురెడ్డి శ్రీరామరెడ్డి

వ్యక్తులకు చరిత్రలున్నట్లే సాహిత్యాలకూ చరిత్ర లుంటాయి. హిందీ సాహిత్య చరిత్రలో 'భక్తియుగం స్వర్ణయుగం'. ఈ యుగంలోని మహాకవులలో ప్రముఖుడు భక్త సూరదాస్. మహాకవి సూరదాస్ కావ్య వైభవాన్ని దర్శించే ముందు వీరి రచనలకు ప్రాణం పోసిన పరిస్థితులను గురించి తెలుసుకొందాం.

దాదాపు ఐదువందల సంవత్సరాలకు పూర్వం మధురా ఆగ్రా నగరాలను కలిపే మార్గమధ్యంలోని 'రేణుకాక్షేత్రం'లో పరిమళించిన యీ జాతి కుసుమం అమూల్యమైనది కావుననే దేశదేశాల ప్రజలు, ప్రత్యేకించి భారతీయులు నేడు వీరి కావ్య సుమసౌరభాలకు కర్పూర హారతు లందిస్తున్నారు. నాటి నుండి నేటి వరకు ఎందరో సారస్వత ప్రియులైన సహృదయులు వీరి కావ్యరసాంబుధి లోతులెరిగి ఆనంద శిఖరాల నధిరోహించారు. భవిష్యత్తు వీరి కావ్య సౌందర్య ప్రభలను కోట్లకళ్ళతో దర్శించి, పరవశించేందుకు సిద్ధంగా ఉంది. ఇందుకేనేమో మరి-రేణుకా క్షేత్రంలోని అణువణువు వేణువులా రవళిస్తున్నది! మనం కూడా విందాం.

హిందీ సాహిత్య చరిత్రలోని ప్రథమయుగం 'వీరగాథా యుగం' భయంకరమైన యుద్ధాలతోను, విషపూరితమైన విలాసవాయువులతోను గాయపడిన నాటి సమాజం' సూరదాస్ 'లాంటి విద్యా వైద్యుల కోసం ఆశతో ఎదురుచూచింది. అదృష్టం ఫలించి 'భక్తియుగం' అమృతత్వంతో అవతరించింది. సమాజానికి ఊరట కలిగింది. కబీర్‌దాస్ జ్ఞానపల్లవాలలో ప్రేమగుణ సంపన్నమైన నిర్గుణభక్తి తత్వాన్నందించాడు. జాయసీ ప్రేమమార్గాన్ని మరీ ప్రశస్తం చేశాడు. తులసీదాస్ మర్యాదా పురుషోత్తముడైన శ్రీరాముని శుభ్రచరిత సంస్కార సారం ద్వారా ఉత్తర భారత దేశానికి కొత్త ఊపిరి పోశాడు. సూరదాస్ కృష్ణమయమైన భవసాగరాన్ని సహజ రససాగరంగా మార్చి తరింపజేశాడు. మీరా తన గానమాధురితో లోకాన్ని ఆలోక శిఖరాలుగా మలిచింది.

సూరదాస్ జన్మాంధుడని కథలున్నాయి. జన్మాంధుడైన సూరదాస్ ఒక పర్యాయం బావిలో పడి వారం రోజులున్న తర్వాత శ్రీకృష్ణుడే స్వయంగా వచ్చి, రక్షించి, దృష్టి నొసంగెనని, పరమాత్ముని చూచిన దృష్టితో లోకాన్ని చూడనని పూర్వస్థితినే కోరెనని, తదనుగుణంగా అంధత్వంతోనే జీవితం గడిపెనని ఒక కథ. సరసుడు సూర్ యవ్వనంలో తన మనస్సునొక సుందరి కర్పించి, తర్వాత చంచలత్వానికి పశ్చాత్తాపపడి కళ్ళను కావాలని దూరంచేసుకొన్నాడని మరొక కథ. జీవితాన్ని సూక్ష్మాతి సూక్ష్మమైన రీతిలో చిత్రించటం గమనిస్తే సూర్ జన్మాంధుడు కాడనే విషయం స్పష్టమౌతుందని మరికొందరి వాదం. ఏది ఏమైనా సూర్‌దాస్ ప్రజ్ఞాచక్షువన్న విషయాన్నంగీకరించని వారు లేరు.

సూరదాస్ సాహితీ క్షేత్రంలో అడుగుపెట్టేనాటికి వల్లభాచార్య ప్రతిపాదితమైన 'పుష్టిమార్గం' మధుర భక్తి తత్వాన్ని పంచుతూ ఉంది. ఆ మహా ప్రసాదాన్ని స్వీకరించి, సేవించిన సూర్ షోడశకళా సంపూర్ణుడు, లీలాగుణ సంపన్నుడునూ ఐన మధుర

మనోహరమూర్తి శ్రీకృష్ణుని వారసుడైనాడు. వల్లభాచార్యుని సూచన ననుసరించి సూర్‌దాస్ శ్రీమద్‌భాగవతాన్ని. ప్రత్యేకించి దశమస్కంధాన్ని సరసమైన పదాలలో సహృదయుల కందించాడు. ఈ పద రవళియే 'సూర్‌సాగర్' నాదమాధురి! కృష్ణసాహిత్యం కడలి కెరటంలా ఎదిగింది - చైతన్యపతాకమై!

శ్రీకృష్ణుని వ్యక్తిత్వం బహుముఖమైనట్టిది. వారి లోకరంజక రూపాన్ని గ్రహించిన సూర్ తన రచనలో జీవితపు ప్రయత్న పక్షం కంటె, భోగ పక్షాన్నే ఎక్కువగా వర్ణించాడు. రాజకీయ ఆశ్రయాలకు, నినాదాలకు దూరంగా, స్వతంత్రంగా పెరిగిన భక్తకవి హృదయం కళను చైతన్య జ్యోతిగా, ఆనందసాగర తరంగ శిఖరంగా దర్శించింది, స్పృశించింది. సూర్ స్పర్శతో కళ పులకించి, మనోహర కావ్య సౌందర్యంతో తనను తానలంకరించుకుంది. లోకాన్ని అలరించింది ఈ కావ్యఫలం అమృత సదృశమైనందున అందరికీ ఆమోదయోగ్యమే!

వల్లభాచార్యుని సుపుత్రుడు 'విఠల్‌నాథ్' సూర్‌దాస్, నందదాస్, కృష్ణదాస్ మొదలైన ఎనిమిదిమంది భక్తకవులతో 'అష్టఛాప్'ను స్థాపించారు. ఇందు మన సూర్‌కు అగ్రతాంబూలం. కృష్ణుని జీవితంలోని కొన్ని సంఘటనలనే తీసుకొన్న యీ కవులు, ప్రత్యేకించి సూర్, ప్రబంధ కావ్యాలకు బదులు గీతాలను ముక్తి రచించారు. జయదేవ, విద్యాపతుల గీతరచనాపరంపర వీరి సరసలేఖినిలో ప్రవేశించి వేణుగానాన్నందించింది. ఇందుకే సూర్‌దాస్ పదాలంటే సహృదయులు చెవులు కోసుకొంటారు. సూర్‌దాస్ బలవంతంగా వ్రాయాలని వ్రాయలేదు. భక్తి తన్మయత్వంలో వారు పలికిన ప్రతి పదం శృతిమధురంగా దశదిశల వ్యాపించింది. అనుభూతి ప్రధానమైన వీరి రచనలు శరపరంపరలా మన హృదయాలలో నాటుకొని మనతోపాటు పెరుగుతుంటాయి. జీవితపు లోతులు తెలిసిన వీరు తమ అనుభవాన్ని సహజ చిత్రరూపంలో సహృదయుల కందించారు. వ్రజభూమిని, భాషను బాలకృష్ణ లీలామృతంతో ఆజరామరం గావించిన సూర్ నిజంగా హిందీ సాహితీ జగత్తులో సముజ్వల స్వర్ణోదయం వీరి కాంతి కిరణ గుచ్ఛం రాగరంజిత కావ్య సుమమాలికయై సరస్వతిని సారస్వతాన్ని అలంకరించింది.

సూర్‌దాస్‌కు బాలకృష్ణుడంటే ఎంతో యిష్టం. పసి పాపల చిరునవ్వుల వెన్నెలలో ఎవరు కరిగిపోరు! బాలకృష్ణ లీలలను వర్ణించటంలో వీరికి వీరే సాటి. వీరిది సహజవర్ణన-సరస చిత్రణ. వీరి కావ్యసాగర తరంగాలను-కొన్నైనా-దర్శిద్దాం-తరిద్దాం.

పిల్లలకు ఆటల పట్ల మక్కువ ఎక్కువ. ఒకరోజు పిల్లలందరు కలిసి ఆడుకొంటుండగా ఉన్నట్టుండి బాలకృష్ణుని దృష్టి బలరాముని జుట్టు ముడిమీదవాలింది. ఆటమాని, తల్లి యశోద వద్దకు వచ్చి మారాము చేస్తాడు. పాలు త్రాగితే జుట్టు పెరుగుతుందని చెప్పి మోసం చేశావంటాడు., బలరామునికి వెన్న రొట్టె లిచ్చి తనకు ఒట్టి పాలిచ్చినందు వలననే తన జుట్టు పెరగలేదని ఆరోపిస్తాడు. బలరాముని జుట్టు బాగా పెరిగినందుకు, తన కలాంటిది లేనందుకు ఎంతో బాధపడతాడు. సహజ ద్వేషంతో కూడిన బాలకృష్ణుని చిరుకోపం చందనంలా తల్లి హృదయాన్నలరిస్తుంది. ఆమె బాలకృష్ణుని తన హృదయ స్పర్శతో కరిగిస్తుంది. ఈ భావమాధుర్యాన్నందించే పదం వినండి ఎంత సరసంగా ఉందో -

"మైయా మేరీ కబ్ బాఢేగీ చోటీ?
కితీబార్ మోహి దూద్ పియత్ భయీ
  యహ్ ఆజహూం హై ఛోటీ,
తూతో కహతి బల్‌కీ బేనీజ్యోం
  హై హై లాంబీ మోటీ,
కాఢత్, గుహత్, న్హవావత్, ఓఛత్,
  నాగిన్‌సీ భుయిలోటీ,
కాచో దూధ్ పియావతి పచి-పచి
  దేత్ న మాఖన్ రోటీ,

సూర్‌స్యామ్. చిరజీవౌ దోవుభైయా,
హరిహలధర్ కీ జోటీ."
సహజ పరిశీలన కిది మంచి ఉదాహరణ !

పిల్లలు ఆటల్లో-అప్పుడప్పుడు-కీచులాడుకొంటారు. ఒకసారి బలరాముడు గోపబాలకులతో చేరి కృష్ణుడ్ని ఏడిపిస్తాడు. కృష్ణుడు యశోదానందుల పుత్రుడు కాదని, ఎక్కడి నుండో కొని తెచ్చుకున్నారని, ఎర్రని యశోదానందులకు నల్లనివాడవైన నీవు పుత్రుడ వెలా అవుతావని ప్రశ్నిస్తాడు. మిగిలిన గోపబాలకులందరు చిటికలు వేస్తూ నవ్వి కృష్ణుని మరీ ఏడిపిస్తారు. అప్పుడు బాలకృష్ణుడు తల్లితో అన్న మాటలు వినదగినవి. బలరాముడు తనను ఏడిపించాడని, ఎంత గోల చేసినా నీవు అన్నయ్యను కొట్టవని, ఎప్పుడూ నన్నే కొట్టటం నేర్చుకున్నావని కృష్ణుడంటాడు-కోపంగా, అప్పుడు తల్లి యశోద బలరాము డెప్పుడూ అబద్ధాలు చెబుతుంటాడని, వాడి మాటలు నమ్మవద్దని, నీవు నిజంగా నా బిడ్డవేనని ఎంతో ప్రేమతో సుపుత్రుని చేరదీసి హృదయానికి హత్తుకుంటుంది. హృదయాలను కరిగించే దృశ్యమిది- తిలకించండి:

"మైయా మోహి రావు బహుత్ ఖిజాయో-
మోసోం కహత్ మోల్‌కోలీనో, తోహి జసుమతి
కబ్ జాయో ?
గోరేనంద్, జసోదాగోరీ,
తుమ్ కత్ శ్యామ్ శరీర్ ?
చుట్కి దై-దై హంసత్ గ్వాల్ సబ్,
సిఖై దేత్ బల్‌వీర్ ...
తూ మోహీకో మారన్ సీఖీ,
దావుహి కబహు నఖీజై.

ఇదే కావ్య కుసుమ మందించవలసిన సౌందర్య సౌరభం.

'మైయా మై నహిం మాఖన్ ఖాయో' లాంటి అనేక పదాలలో బాలకృష్ణుని సహజ లీలలను ఎంతో సరసంగా చిత్రించారు సూర్.

రాధాకృష్ణుల బాల్య స్నేహం వయసుతో పాటు పెరిగి ప్రేమగా మారుతుంది. వీరి ప్రేమలీలలు బృందావనికే సరికొత్త శోభ నందిస్తాయి. వెన్నెలలు వర్షించే కృష్ణుని కళ్ళు రాధా గోపికలను కలవరపెట్టసాగాయి.' దేఖిరీ హరికే చంచల్‌నైన్' అంటూ వారు తమ జీవితాలను కృష్ణునికి ముడుపు గడతారు. 'సున్‌రీ సఖీ.... నానాభాంతి నచావతి'లో పిల్లనగ్రోవి ప్రసక్తి తెచ్చి, దానిలా తాము గూడ మాధవుని అధరాలను చేరాలని తొందర పడతారు. బృందావనం వీరితో సహకరిస్తుంది. రాధాకృష్ణుల ప్రేమ ఆదర్శ ప్రేమగా ప్రసిద్ధ మవుతుంది.

జీవితం వెలుగునీడల దోబూచులాట గదా! ఉన్నట్లుండి కృష్ణుడు రాచకార్యార్థం మథురా నగరానికి వెళ్తాడు. బృందావనం వెలవెలబోతుంది. వ్రజభూమిలోని వారందరు, ప్రత్యేకించి 'రాధాగోపికలు' తీవ్ర మనోవేదనకు గురి యౌతారు. 'అంఖియా హరిదర్‌సన్ కీ ప్యాసీ'. 'నిసిదిన్ బరసత్ నైన్ హమారే', 'ప్రీతికరి కాహూ సుఖ్ న లహ్యో... సూర్‌దాస్ ప్రభు బిన్ దుఖ్ దూనో నైనన్ నీర్ బహ్యో' లాంటి రససిక్తమైన పదాలలో మహాకవి సూర్‌దాస్ రాధాగోపికల వియోగజన్య హృదయావేదనను సహజంగా చిత్రించారు. కృష్ణుని పేర సందేశం వ్రాసి పంపించాలని వారెంతో ప్రయత్నం చేస్తారు. కాని నిరంతరం ప్రవహించే కన్నీటి ఝరులు అక్షరాలను చెరిపి, అంతా కృష్ణమయ్యం

(నల్లగా) చేస్తాయని చెప్పే సూర్ పదం నిజంగా పరసవేది. నిత్యం నీటిలో ఉంటున్నందు వలన వీరి కళ్ళను చేపలతో పోల్చారు సూర్. ఈ కస్మీరు సూర్ కలంలో ప్రవేశించి ఎన్నో రసమయ గీతాలను విని పిస్తుంది, జీవితపు లోతులు చూపిస్తుంది.

మానవ సహజమైన అసూయను వ్యక్తం జేసే ఒక పదం పరిశీలిద్దాం. తాము వియోగవ్యథ ననుభవి స్తున్న సమయంలో మరెవ్వరూ సంతోషంగా ఉండ రాదని రాధా-గోపికల భావం. మధువనంలోని పుష్పిం చిన చెట్లను చూచి, వారు కృష్ణుడు లేనప్పుడు పూలెం దుకు పెట్టుకున్నారని చెట్లను ప్రశ్నించి, చెట్లింకా సిగ్గులేక పత్రపుష్పాలతో నిలబడే ఉన్నాయని, నిజాని కవి నేలకూలి, వియోగానలంలో కాలిపోవాలని వారు తమ బాధను చెట్లకంటగట్టి విచిత్రంగా మాట్లాడుతారు. ఈ గీతంలో ప్రకృతి యొక్క మానవీకరణ, రాధా గోపికల తీవ్ర హృదయావేదన, అసూయ సరసంగా చిత్రించబడినాయి. ఉత్తమ కావ్యరచన కిది యొక మంచి నిదర్శనం

-o-

—కాకినాడ

తూర్పుగోదావరి జిల్లా.

# రాయప్రోలు వారి రచనల్లో స్త్రీగుణవర్ణన

-డా॥ ఎం. లావణ్య సరస్వతి

"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః
యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రా ఫలాః
క్రియాః"

అని అంటూ స్త్రీలు పూజింపబడితేనే దేవతలు ఆనందిస్తారని భారతీయ సంస్కృతీ సంప్రదాయం స్త్రీని అనాదిగా గౌరవిస్తూనే ఉంది "శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులమ్" అంటూ స్త్రీల ఆనం దానికి స్మృతులు ప్రాధాన్యాన్నిచ్చాయి.

సంఘ పరంగా స్త్రీకివ్వాల్సిన స్థానాన్ని సాహిత్యం నిలబెట్టాలి. సాహిత్యం, సమాజం మీద తన ప్రభా వాన్ని చూపుతుంది. స్త్రీ సౌందర్యానికి ప్రతీకే అయినా, స్త్రీలోని ఇతర గుణాలను నిర్లక్ష్యం చేసి కేవల సౌందర్యానికే సాహిత్యం ప్రాధాన్యాన్నిస్తే వ్యక్తిగా స్త్రీ మరుగునపడిపోయే అవకాశం ఉంది.

ధర్మప్రతిపాదకాలయిన రామాయణ భారత భాగ వతాది గ్రంథాలు స్త్రీలోని ఉత్తమగుణాలను కీర్తిస్తూ స్త్రీని గౌరవించాలనే బోధిస్తాయి. ప్రాచీనాంధ్ర సాహి త్యంలో కూడా ప్రారంభంలో ఎక్కువ భాగం పురా ణేతిహాసాల అనువాదాలు కావడంవల్ల స్త్రీ పతివ్రతగా పవిత్రమూర్తిగా ధర్మనిర్వహణలో సహాయకారిగా చిత్రించబడ్డమే [illegible]పడుతుంది.

కావ్యరచనలో కొంత స్వాతంత్ర్యం కనబరచిన ప్రబంధాల్లో స్త్రీసౌందర్యవర్ణనకు ప్రాధాన్యం హెచ్చింది. ఒక నాయికనుమించి మరొక ప్రబంధ నాయికను సౌందర్యవతిగా తీర్చిదిద్దే ప్రయత్నంలో ఆపాద మస్తకం అంగాంగాన్ని పోటీపడి కవులు వర్ణించారు.

దక్షిణాంధ్రయుగం నాటికి సాహిత్యంలో స్త్రీవ్యక్తిగా మరుగునపడి విలాసవతిగా నిలబడింది. ఆమెసౌందర్య విలాసాలే ప్రధానమయ్యాయి కాని సంఘంలో ఆమె కున్న స్థానంకాని, ఆమెమానసిక స్థితిగాని, గుణ గణాలుగాని, సమస్యలుగాని ఎక్కువగా చిత్రించ బడలేదు.

ఈ విధమైన సాహిత్యవాతావరణంలోని స్త్రీవ్యక్తి త్వాన్ని నిలబెట్టి స్త్రీగౌరవాన్ని పునరుద్ధరించారు. రాయప్రోలు సుబ్బారావుగారు స్త్రీని వాత్సల్య మూర్తిగా, దాక్షిణ్యమయిగా, వివేకవతిగా, చిత్రించారు. స్త్రీ అంటే కేవలం భార్యమాత్రమే కాదు; మాతృ మూర్తి, సోదరి, కూతురు కూడా అని గుర్తుచేశారు

స్త్రీ అంతఃకరణంలోని ప్రేమ స్వరూపాన్ని చూపా లన్నదే వారి ఆశయం. కనుకనే

కులశుభాంగి వయోధీర కుసుమ మందు
మోహమధువె గవేషించె మున్ను సుకవి
సాత్త్వికప్రేమ కోశపేశలము లయిన
వత్సలామృత రుచులను వలచెనేడు

అని అంటారు.

పురుషుడికి ప్రేమపంచి ఇచ్చే స్త్రీ కేవలం భార్య ఒక్కతేకాదు తల్లీ చెల్లీ కూతురుకూడా వారి వారి పరిధుల్లో ప్రేమిస్తూనే ఉంటారు. అందుకే రాయప్రోలు రచనలో ఒక స్త్రీ పాత్ర—

ఒకనికి కుమారితను మరియొకనికి సఖి
నింకొకనికి తల్లిని ఇందులోన

నెవ్వరితనో భావింపును హృదయమందు
వావి వరుసలు వాసనావశములేని"
అని సవాల్ చేస్తుంది.

ఇంతేకాకుండా వీటికి 'స్నేహితురాలు' అనే ఇంకొక బంధాన్ని కూడా రాయప్రోలు కలిపారు. స్నేహం ఇద్దరు స్త్రీలమధ్య ఇద్దరుపురుషుల మధ్యేకాదు. ఒక స్త్రీ ఒక పురుషుడు స్నేహంగా ఎందుకు ఉండకూడదు అని వీరి ప్రశ్న, అందుకే ఒక సందర్భంలో ఇలా అన్నారు.

"స్త్రీని భార్యగానూ కామదృష్టితోనూ చూడ్డం అలవాటైపోయింది మనకు ఇంతవరకూ వచ్చిన ప్రబంధాలలో అంతా ఇదేదృష్టి. ఇదేం బాగుంది? స్త్రీని మంచి స్నేహితురాలిగా ఎందుకు చూడకూడదూ? ఇప్పటి చదువుల్లో ఆడపిల్లలూ మగపిల్లలూ కలిసి చదువుకుంటున్నారు—ఈ సమయంలో మన పాత ప్రబంధాల్లోని భావాలనే చెప్తే ఎట్లా? స్త్రీ పురుషుల మధ్య స్నేహం ఉండాలి."

ఈ రకంగా భావించిన రాయప్రోలు వారు తమ రచనల్లో ఔన్నత్యాన్ని పునః ప్రతిష్ఠించారు.

ధృతిః క్షమా దయా శౌచం
కారుణ్యం వాగ నిష్ఠురా
మిత్రాణాంచానభిద్రోహః
సప్తైతాః సమిధః శ్రియః

అని వ్యాసభారతంతో చెప్పబడిన స్త్రీ గుణాలను వీరు ఆదర్శంగా గ్రహించారు. ఈ గుణాల వర్ణనతో స్త్రీ అంతరంగ సౌందర్యాన్ని అతిరమ్యంగా తీర్చిదిద్దారు.

ముందుగా ఆకర్షించేది స్త్రీబాహ్యరూపమే అయినా అశాశ్వతమైన దేహాన్ని ఆశ్రయించినది కాబట్టి, ఆకర్షణ తాత్కాలికం అయ్యేఅవకాశం ఉంది. కాని స్త్రీ మృదు స్వభావదర్శనం ఆమెమీద శాశ్వత గౌరవాదరాలను కలిగిస్తుంది ఉత్తమ సాహిత్యం శాశ్వత విలువలు కలిగిన ఉన్నత గుణాలను కీర్తించాలే గాని మోహాన్ని రెచ్చగొట్టే ఆంగిక సౌందర్యాన్నికాదు

బాహ్యానిష్ఠమైన సౌందర్యంకంటె ఆత్మసౌందర్యం గొప్పదనే దృష్టితో స్త్రీలోని వాత్సల్యంవంటి అమృత గుణాలను కీర్తించి, స్త్రీని ఉన్నత పీఠంమీద నిలబెట్టారు సుబ్బారావు గారు.

వీరిమొదటి రచన 'లలిత'లో నాయిక లలిత ధృతిమతి. రాజాంతఃపురాల్లో సుకుమారంగా పెరిగినా ఆ వైభవాలను త్రోసి రాజని సాహసంతో తన ప్రియుడిని వెతుకుతూ ఆడవుల వెంబడి తిరిగింది.

ఎడనెడపారుచున్న సెలయేళ్ళను వెచ్చని నీరు
త్రావుచున్
పొడమిన కందమూలముల భోజనవేళల
నారగించుచున్
కడయు మొదల్ కనంబడని కాననమందు
భ్రమింతునొంటిగా
జడియక దైన్యమందక నసాధ్యమటంచు
త్యజింపకెంతయున్.

అన్నమాటలు నాయిక ధైర్యాన్ని చక్కగా చూపుతాయి.

స్నేహితునికి ప్రేమతత్వాన్ని విప్పి చెప్పి అతడిని వేరే వివాహానికి సుముఖుని చేయడానికి ఎంతో ప్రయాసపడుతూ వెళుతుంది. తృణకంకణ నాయిక. స్త్రీ ప్రేమస్వరూపిణి. సహనశీలి కనుకనే అడుగులు బొబ్బలెత్తగా చెమ్మటలు మడుగులు గట్టగా మండుటెండలో కాలినడకన బయలుదేరుతుంది. ఇసుకలో దిగబడే కాళ్ళను ఈడ్చుకుంటూ ఉడుకు టెండకు నిట్టూర్పులు వదలుతూ స్నేహితుణ్ణి ఓదార్చడానికి వెళ్ళింది. ఈ అలసటను లెక్కచేయకుండానేత నదగ్గరకు చేరిన లేడితో ఆమె వ్యవహరించిన తీరు ఆమె ప్రేమ స్వభావాన్ని చక్కగా చూపుతుంది. వివేకవతి కనుకనే

తన వాగ్నైపుణ్యంతో నాయకుని మనసు మార్చ కలుగుతుంది.

స్త్రీ ప్రకృతితో కనిపించే స్నేహభావాన్ని గూర్చి "కలిసి మాటాడినట్టి ధన్యులకు నెల్ల తలపులెడలదు స్నేహలతా కుమారి." అని అంటారు రాయప్రోలు వారు. స్నేహలతను ఆమె స్నేహితురాలు ప్రియంవదను గూర్చి 'దేహములందు దక్క విడదీయడు వారల బ్రహ్మ' అని అంటారు. వీరి రచనల్లో చాలా పాత్రలు ఒకరికొరకు స్నేహితులే.

స్త్రీ వాత్సల్యవతి. మాతృభావనే ఆమెను పులకింపజేస్తుంది. కామ దృష్టితో తనను కటాక్షించమని వేడుకున్న నాయకునికి అనురాగమే శిక్షగా విధిస్తూ 'స్వప్నకుమార' నాయిక మాతృవాత్సల్య స్వరూపాన్ని ఆవిష్కరిస్తుంది. ఫలితం నాయకునికి ప్రకృతిలో మాతృమూర్తి దర్శనం. 'కష్టకమల' కావ్యంలో మేనగోడలు 'కమల' చిన్నబోయి ఉండటాన్ని గమనించిన మేనత్త 'పూర్ణ' స్త్రీహృదయం పరితపిస్తుంది. ఆమెను చేరబిలిచి దగ్గరకు తీసుకొని చెక్కిళ్ళు దువ్వుతూ...

"... కమల చుబుకమును బట్టుకొని ననుజూడుమనుచు నయము బాలికావదనమందున చూపులు నిల్పి దృష్టిదోషాయిత బుద్ధియై మెటికెలల్లన దీర్చుచు క్రింది రెప్పలన్ బోయి నలంతి చెమ్మటలు వోదుడిచెన్ .."

అన్న వర్ణన స్త్రీలోని అనురాగానికి మచ్చుతునక. విషాదాన్ని చూడడం కాదు వినికూడా సహించలేని కోమల హృదయం 'అజ విలాప' ఘట్టాన్ని విని కంట తడిపెట్టిన పూర్ణలో కనబడుతుంది.

స్త్రీలో త్యాగశీలత మరొక లక్షణం "అనుమతి" అనే పేరుగల కావ్యనాయిక తన జీవిత సౌఖ్యాన్ని తన ప్రియుని కుటుంబానికి సహాయపడాలని కోరుకుంది. ప్రియుడు అకాల మరణం పొందగా అతడి భార్యాబిడ్డల రక్షణనే తన జీవిత ధ్యేయంగా నిర్ణయించుకుంది. ఈ నిర్ణయం ఈమె త్యాగశీలతను చక్కగా చూపుతుంది. అనుమతి ప్రియుడి కుటుంబానికై త్యాగం చేస్తే స్నేహలత పితృగృహ పరిరక్షణకై తన జీవితాన్ని ఆహుతి చేసింది. వరకట్నం ఇవ్వడం కోసం నిలువనీడ పోగొట్టుకొని తండ్రి సోదరులు బాధ పడడం ఈమె ఊహించలేకపోయింది.

నాకతంబున ముద్దుకూనలును అమ్మ
తండ్రి నీవును దీర్ఘ నిదాఘ తాప
బహుళ దారిద్ర్య వారాశి పడెడు వారె
వలదు పలదిట్టి కుల మహోపద్రవమ్ము.

అని ఆత్మత్యాగమే ఆ మహోపద్రవాన్ని నివారించగలదని నిర్ధారణ చేసుకొని తన శరీరాన్ని అగ్నికాహుతి చెనుకుంటుంది.

అయితే ఎంత సుకుమార హృదయులయినా స్త్రీలు వివేకహీనులుకారు. సుబ్బారావుగారి కావ్యాల్లో ఎక్కువభాగం స్త్రీలే వివేకంతో వ్యవహరిస్తుంటారు. రాయప్రోలువారు తాము దర్శించిన ప్రేమతత్వాన్ని వాత్సల్యరూపాన్ని స్త్రీపాత్రల నోటనేపలికిస్తారు. ఉపదేశించే స్థానంలో స్త్రీ— ఉపదేశాన్నిపొందే స్థానంలో పురుషుడు వీరికావ్యాల్లో కనబడుతారు. 'రూపనవనీతమ్'లో "భామతి" ఎన్నో విషయాలకు అద్భుతమైన వ్యాఖ్యానాలను చెప్తూ విదుషిగా గోచరిస్తుంది. తృణకంకణనాయిక, స్వప్నకుమార నాయిక, మిగిలిన కావ్యాలలోని కమల, లలిత,అనుమతి, స్నేహలతవంటి స్త్రీలు ప్రేమస్వరూపాన్ని విచక్షణతో ఆవిష్కరిస్తారు. విషమ పరిస్థితులను చాకచక్యంతో ఎదుర్కొంటారు. సమస్యలకు పరుష్కారాలను సూచి

స్తారు. 'కనకము' అనే ఖండికలో పిట్టను పట్టుకున్న కుమారుని పినతల్లి దానిని విడిచిపెట్టమని "ఆడువారి మెత్తని గౌనముల సారళ్యమలమికౌనగా" ప్రాధేయ పడుతుంది. కనికరం కళ్ళలోకదిలాడుతుండగా తన ప్రాణం తల్లడిల్లుతోందని విలవిలలాడుతోంది. ఆ పిట్టను విడిపిస్తుంది. ఈ పాత్రలో స్త్రీ స్వభావంలో జాలి కరుణ కళ్ళకు కడతాయి.

స్త్రీలోకనిపించేవి క్షమ కరుణ వాత్సల్యాలవంటి గుణాలేకాదు. పురుషుణ్ణి వలచి వలపించుకోవడంకూడా స్త్రీజీవితంలో అతిప్రధానమూ అత్యంత సమాజమూ అయినగుణం కనుకనే సుబ్బారావుగారు స్త్రీప్రేయసిగా ప్రేమను వ్యక్తంచేయడాన్ని కూడా సుకుమారంగా సుందరంగా చిత్రించారు. భర్తకు ఉపచారాలు చెయ్యడంలో స్త్రీచూపే శ్రద్ధాసక్తులు అతిథులకు వండి పెట్టడంలో ఆమెఓర్పు నేర్పు ఇల్లాలుగా ఇరుగుపొరుగులతో అమె మెలిగేతీరు "పెండ్లి-గృహం" అన్న ఖండికలో చక్కగా చూపారు. తమది జన్మజన్మలబంధంగా భావించి ప్రియునిపై తనే అనురాగాన్ని ఎంతగాఢంగా నిలుపుకుంటుందో కొన్ని ఖండికలలో చూపారు.

ఈ విధంగా వీరి రచనల్లో స్త్రీ స్వభావంతో అన్ని కోణాలూ రమ్యంగా చిత్రించబడ్డాయి. వీరికావ్యాల్లో కనిపించే స్త్రీ,బంధువులతో అభిమానింపబడటమే కాదు తన మంచి గుణాలతో, తేనె ధారలపలుకులతో, పాల వెన్నెల చూపులతో.

పడుచులకు పిన్నిమాలచ్చి వాడకెల్ల
వృద్ధజనుల కమ్మాయమ్మ ఇష్టదైవ
మూరి వారి కందరకు నా యోగ్యరాలు"

3-3-835/19
కుతబీగూడా
హైదరాబాద్. 27

## హిందీ పరీక్షా ఫలితాలు

ఆగస్టు 1983లో జరిగిన ప్రారంభిక హిందీ పరీక్షా ఫలితాలు ప్రకటించబడి, హిందీ పండితులకు పంపబడినవి.

వ్యవస్థాపకులు
పరీక్షా విభాగము

# శ్రీశ్రీ మహాకవిత్వం

—మానేపల్లి

తెల్లదొరలపాలన- మనదేశాన్ని కడతేరలేని కడగండ్లపాలుచేసినా, ఇంగిలీషుచదువులునేర్పి- చుట్టూ వున్నలోకాన్ని కళ్లుతెరిచి చూడగలఇంగితాన్నిమాత్రం పుష్కలంగానే ప్రసాదించింది. దేశీయుల కంటిచూపు కడలి తీరాలుదాటి ఖండాంతరాలకు ప్రసరించింది. ఫలితంగా స్వస్వరూపజ్ఞానం ఏర్పడి- మనదైన కూపస్థ మాండూక్యం మనకు విస్పష్టంగా బోధపడింది. ఆ 'బోధ'తో బాధపడిన హృదయాలు-విశాలమయ్యాయి. బుద్ధి వికసించింది. సామాజిక జీవితాన్ని ముందుకు సాగనీకుండా పరాయిదొరల పెట్టుబడిదారీ గుత్తాధిపత్యం పులికాపుగాసినా సాహిత్యరంగంలో ఎంతో కొంత ముందుచూపు అలవడింది. సాంఘిక, భాషా, సాహిత్యరంగాల్లో ఆ చూపుతో ముందుకు నడిచిన మహానుభావులు ముగ్గురు కందుకూరి వీరేశలింగం, గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావుగార్లు.భాషా సాహిత్యమూ సంఘజీవితంలో భాగాలే కనుక- ఇవి వేర్వేరు రంగాలని చెప్పడంకూడా సరికాదు. వీరు ముగ్గురూ తెలుగువాడి సర్వతోముఖాభివృద్ధికి—త్రికరణశుద్ధిగా, మనోవాక్కాయకర్మలా, కృషిచేశారు. దాదాపు వెయ్యేళ్లుగా వేసినచోటే పడిమూలుగుతున్న తెలుగుగొంగళి తెలివి తెచ్చుకొని- శతాబ్ది సంఖ్య మారే సరికి (అంటే 1875-1925 మధ్యగల 50 ఏళ్ల కొద్ది కాలంలో) ఇరుగుపొరుగువారినే కాదు ఇతర దేశాల వాళ్ళని సైతం అందుకుందుకు అర్రులు చాచింది ఎంతో కొంత సఫలమూ అయింది.

సంప్రదాయబంధాలసందిట్లో ఇరుక్కున్న ప్రబంధంమార్కు లేక, ప్రభుత్వం మార్కు పద్యసాహిత్యం- కొత్తవూపిర్లు పీల్చుకున్నది. సరికొత్త పుంతలూ తొక్కింది.

ఒక రాజశేఖర చరిత్రేకాదు, సత్యరాజ పూర్వదేశయాత్రలే కాదు- స్వీయ చరిత్రలూ, సొంత పత్రికలూ కూడా తెలుగులో ఏర్పడ్డాయి. పురాతన తరంగాలు పక్కకి తప్పుకుని, వర్తమాన[1] తురంగాలు ప్రజాజీవితంలో కదనుతొక్కడం ప్రారంభించాయి. సంజీవనివంటి హాస్యం[2] శవప్రాయమైన పాతచదువులకూ, రోతబ్రతుకులకూ శభాషయిన వైద్యం చెయ్య సాగింది. అవ్యవహారికమైన గ్రాంథికభాష తాళపత్రికా గ్రంథాల్లో ఆగిపోయి, సవ్యమైన వ్యావహారికం వీధిలోకొచ్చి నిలబడింది. పుత్తడిబొమ్మ వంటి కన్యక పూర్ణమ్మ కథలు, కన్యాశుల్కంలు ఖంగాళీలు సాహిత్య వస్తువులయ్యాయి, తెలుగువాడి రాజకీయ జీవితం సైతం ప్రప్రథమంగా రంగస్థలం ఎక్కింది. గిరజాలు సవరించుకుంటూ గిరీశం ప్రవేశించి "మనవాళ్ళుత్త వెధవాయిలోయ్" అని తెగేసి చెప్పాడు. పశ్చిమ బుద్ధులకు తోక ఝాడించక తప్పిందికాదు. దేశాభిమానం పెరిగి జల్దుకొని కళలెల్ల కొత్తదారి పట్టాయి.

ఆ సమయంలోనే విశ్వనాథ, కృష్ణశాస్త్రి, రాయప్రోలు వగైరాదులు సంప్రదాయ కవిత్వాన్ని, భావకవిత్వాన్నీ కూడా అత్యంతప్రతిభావంతంగా రచించనారంభించారు. షెల్లీ ప్రభృతి ఆంగ్లకవుల సౌకుమార్యమేమొంటబట్టింది గాని- మతమౌఢ్యం పైనా భావదాస్యం పైనా అతడు చేసిన తిరుగుబాటు తలకెక్కింది కాదు. సమాజ స్వేచ్ఛ నోరు తిరగని పెద్దపదం అయినా- వ్యక్తి

స్వేచ్ఛ బాగానే అర్థం అయింది. వ్యక్తీకరణలో నూతనత్వం, పదాల పోహళింపులో నవ్యత రంగరించుకున్న కవిత్వమే రాశారు. విశ్వ. కృష్ణ రాయ కవులు. అయితే వీరి వ్రేళ్ళు ప్రాచీన కవితాక్షేత్రంలో బలంగా పాతుకుపోయాయి. పుంభావ సరస్వతులూ, అవధాన పంచాననులూ, భావకవీంద్రకవీంద్రులూ- వీరిగురువులు. కందుకూరి, గిడుగు, గురజాడ తెచ్చినభావ విప్లవాన్ని ఇచ్ఛాపూర్వకంగా కాకున్నా, సహజమైన వర్గస్వభావంచేత శాస్త్రి కృష్ణ, నాథ విశ్వాయణలు రెండడుగులు వెనక్కి ఈడ్చుకు పోయారు. ఈశతాబ్దపు తొలి అర్థభాగానికి సంబంధించి ఆదివొక సంధికాలం. సరసకవిత్వావధానాల 'రంధి'లో కవులందరూ పడ్డగడ్డుకాలం. ఆర్థికమాంద్యపు మహమ్మారి పీడనలో ప్రజలంతా పడికొట్టుకుంటున్న గొడ్డుకాలం

సీమలో భారతీయయువకుల ఆలోచనలలో మెరిసిన [1]అభ్యుదయకవితామేనిఫెస్టో'4 స్టీమరెక్కి తిన్నగా ఎక్కడదిగాలో అక్క దేదిగింది. అరతావు సైజులో వున్న ఆ అచ్చుకాయితం ఎవరిచేతిలో పడాలో వారి చేతిలోనే పడింద. ఫలితంగా-

పొలాల నన్నీ
హలాల దున్నీ
ఇలాతలంలో హేమంపిండగ
జనానికంతా సౌఖ్యం నిండగ
కమ్మరికొలిమీ. కుమ్మరిచక్రం
జాలరి పగ్గం
సాలెలమగ్గం
శరీరకష్టం, స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి
సహస్రవృత్తుల సమస్తచిహ్నాలు-
నా వినుతించే
నా విరుతించే
నా వినిపించే నవీన గీతికి
నా విరచించే నవీనరీతికి

భావం, భాగ్యం, ప్రాణం, ప్రణవం- అని ఒక కవి తిరుగులేని 'ప్రతిజ్ఞ' చేశాడు. అప్పటికే అతడు-

మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది
పదండి ముందుకు
పదండి త్రోసుకు
పోదాం, పోదాం పైపైకి
ఎముకలు క్రుళ్ళిన
వయస్సు మళ్ళిన
సోమరులారా చావండి
నెత్తురు మండే
శక్తులునిండే
సైనికులాలా రారండి
ప్రభంజనంవలె హోరెత్తండీ
భావవేగమున ప్రసరించండీ

-అంటూ విరామమెరుగక మరోప్రపంచపు కంచు నగారా మ్రోగిస్తూ-పిలుపిస్తున్నాడు నేనుసైతంప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చి- నేను సైతం భువనభవనపు బావుటానై పైకి లేస్తానని తిరుగులేని తన నిర్ణయాన్ని స్పష్టం చేశాడు. ని దకు వెలియై తానొంటరియై తనగదిలోపల చీకటిలో, చీకటిలోపు తనగదిలో నిర్భాగ్యపునీడలు ఎడారిలో ఓడలుచూసి- నిరాశలో కూరుకుపోయి నిజంగానే నిఖిలలోకం నిండు హర్షం వహిస్తుందా? నిజంగానే నిజంగానే అంటూ సంతోషంతోనూ, సంతాపంలోనూ తనలోతనేమాట్లాడుకుంటూ— శ్రీనివాసరావ్, శ్రీనివాసరావ్ దేనికోసమోయ్ దేవులాడుతావ్ అని పలకరించుకుంటూ అనునయించుకుంటూ- ప్రశ్నలే ప్రశ్నలే తప్ప జవాబులు సంతృప్తి పరచకపోతే, చివరికొక దృఢమైన సమాధానం చెప్పుకున్నాడుకాదు- లోకానికి చాటిచెప్పాడు. "అలజడి మా జీవితం, ఆందోళన మా ఊపిరి, తిరుగుబాటు మా వేదాంతం" అని పిడికిలి బిగించాడు

''ముళ్లూ, రాళ్లూ అవాంతరాలెన్నివున్నా ముందుదారి మాది ఉన్నచోటు చాలును మీకు, ఇంకా వెనక్కి పోతామంటారుకూడా మీలోకొందరు. ముందుకుపోతాం మేము, ప్రపంచం మావెంట వస్తుంది'' అని నడుంకట్టి మహాప్రస్థానించాడు. శ్రీరంగం శ్రీనివాసరావనే ఆ చిరంజీవి మానవుడు- తిరుగుబాటు వేదాంతిగా మారిన ఆ 'ప్రభవ' భావకవి- తిరుగుబాటు వేదాంతిగానే కడవరకూ నిలబడ్డాడు.

భావకవిత్వానికి రాయప్రోలువారిని ఆద్యులుగా అంగీకరిస్తూనే ఆ కవితాభవనపు మూలస్తంభాలలో ముఖ్యునిగా కంటక కిరీటధారి, ఊర్వశీహృదయవిహారి కృష్ణశాస్త్రిని ఆరాధించాడు. అప్పటికి అకవికిశోరాన్ని అత్యంతంగా ఆకర్షించింది విశ్వనాథ వారు అయితే సత్యనారాయణ, శాస్త్రిల 'ఇనుప పిడికిళ్లనుండి బయట పడటానికి సుమారు పదిసంవత్సరాల' విలువైన సృజనాత్మకమైన యౌవనకాలం వెచ్చబెట్టవలసి వచ్చింది శ్రీనివాసరావుకు.[5]

చింతా దీక్షితులు, బసవరాజులగార్లు అతన్ని గురజాడ దగ్గరికి చేర్చారు.[6] ముద్దుకృష్ణ అక్షరాలా 'జ్వాల'నే చేతికందించి, పెద్దదిక్కులా ఆదుకుని ముందుకు నడిపించాడు. శిష్టా నిజంగానే విశిష్టమైన స్ఫూర్తినిచ్చి సాయంచేశాడు. ఇవన్నీకలిసి అతన్ని గురజాడకు సరియైన వారసుడిగా చేశాయి పాత మాటలతోనే క్రొమ్మెరుంగులు చిందే కవిత్వం ఎంత గొప్పగా చెప్పవచ్చునో— చెప్పి మరీ ఒప్పించి చూపించాడు గురజాడ కవిత్వం వ్యావహారికభాషలోనే సాగాలనీ అప్పుడే అది ప్రజలకు చేరువై సార్థకమౌతుందనీ చాటడమేకాక- అదే అచ్చమైన కావ్యభాషఅని నిరూపించాడా మహాకవి. భాషను, సంఘసంస్కరణకు అంకితం చేసిన మహనీయుడు. గురజాడ బుజాని కెత్తుకున్న 'సంఘసంస్కరణ ప్రయాణపతాక'ను—
ఆ వెంటనే అక్షరాలా బుజానికెత్తుకొని
దాకా దించని వీరుడు శ్రీశ్రీ.

ప్రతిభ విషయంలో నారాయణబాబు శ్రీశ్రీకన్న లఘువుకాదు. ఆమాటకొస్తే బిగువైనవాడుకూడానేమో. కోకంకివారుచెప్పినట్టు- శ్రీశ్రీ స్థూలదృష్టికి చక్కగా అందుతాడు. నారాయణబాబు సూక్ష్మదృష్టికి వినా అందడు. ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీబాధ. నిజమే అందుకే ఆ కవితకు అంతగాఢత. నారాయణబాబుది మరింతగాఢమైనబాధ. లోతును అందుకోగల కళ్లున్న వాళ్లకు నారాయణబాబుకవిత కన్నీళ్లు నించుతుంది. కడుపులో చేయిపెట్టి దేవినట్టు అవుతుంది. అతని కవితలోని క్లుప్తతనూ, హ్రస్వలిపినీ, ఆలోచనా సూక్ష్మతనూ అభివ్యక్తిలో తీవ్రతనూ మరొక్కకవి అందుకోలేదు. నారాయణబాబు, శ్రీశ్రీ లిరువురూ చేసింది భావకవిత్వంపై తిరుగుబాటు. భావకవిత్వాన్ని దెబ్బతీసేందుకు వచ్చిన ఏ చిన్న అవకాశాన్నీ జారవిడువలేదు నారాయణబాబు. భావకవిత్వాన్ని తుంగలో తొక్కి ఇరువురూ అభ్యుదయకవిత్వాన్ని, అధివాస్తవిక కవిత్వాన్ని ఆరాధించారు.

నారాయణబాబు, శ్రీశ్రీ, శిష్టా, పఠాభి— ప్రభృతులు చేసినపని భావకవిత్వాన్ని గద్దెదించడం. వీరంతా ప్రాచీన ఛందస్సుల నడుముల్ని— కవితలనే దొడ్డు కర్రతో విరగదన్నారు. వారి రచనకు దినుసేకాదు మనసే మారిపోయింది. నాణ్యమేకాదు, నడకా మారిపోయింది. సాహిత్యరథం కొత్తజాడ తొక్కింది. ఆ జాడ గురజాడ. శ్రీశ్రీ మాటల్లోనే చెప్పాలంటే-

''అంతవరకూ వెయ్యేళ్లు అవ్యాహతంగా సాగుతూ నలిగిన క్లాసికల్ బండిదారినుంచి గురుజాడ తెలుగు కవిత్వానికి ఒకక్రొత్త మలుపుఇచ్చాడు. రథాలూ, పల్లకీలూ, గుర్రబ్బళ్లూ వెళ్లేదారి తప్పించి, మోటార్లు రైలుబళ్లూ తిరిగే ఆధునికయుగానికి తెలుగు కవిత్వాన్ని మళ్లించాడు. ఆవిధంగా గురజాడ జాడలో- శ్రీశ్రీ ప్రభృతుల నాయకత్వంతో అభ్యుదయకవిత్వం అనర్గళంగా 'కోటలు కడచీ, పేటలు గడచీ, బాటలు నడిచీ' ముందుకు మున్ముందుకు సాగింది.

మార్క్సిజం ప్రభావం తెలుగుదేశం మీదికి అలా వుంచి- చదువుకున్న బుద్ధిజీవులపైకూడా ప్రసరించి వుండనికాలంలో, ఆర్థికమాంద్యంవంటి అగ్నిపర్వతం సైతం అంతరంగాల్లో ఆలోచనలు కదలించి వుండని కాలంలో- శ్రీశ్రీ, నారాయణబాబు, శిష్ట్లా, పఠాభి, ముద్దుకృష్ణ అదులు- నిక్కచ్చిఅయిన సామాజిక స్పృహతోనూ, కష్టజీవులపట్ల కరిగిన కరుణాంత రంగంతోనూ కలాలు కదిలించారు.

అయితే ఆ సమయంలో- అంటే అభ్యుదయకవితా వాయువులు పుష్కలంగావస్తున్న మంచి తరుణంలోనే అందుతోపాటు అధివాస్తవిక వాయువులుకూడా జోరుగానే వీచనారంభించినాయి. ప్రతిభావంతమైనకవి అధివాస్తవికకవితలో సైతం అధోజగత్సహోదరుల అంతరంగకథనం చెయ్యగలడు. శ్రీశ్రీ నారాయణబాబులు ఆపని అత్యంత సమర్థవంతంగా నిర్వహించారు. అధివాస్తవికత ఎంతో బలమైనవాహిక నిజమేకాని- పాఠకులకది బలాహారంగా మారింది. మానవ జీవితాన్ని అన్ని కోణాల నుండీ ఆక్రమించుకున్న యంత్ర నాగరికత మానసికంగాకూడా అతన్ని గ్లానిలో ముంచింది. ఆ రోజుల్లో ఈ అధివాస్తవిక కవితా కెరటం ఎంత బలంగా వీచిందంటే—అప్పటికే కమ్యూనిస్టు మహాసభల్లో గురజాడ దేశభక్తి గీతంతో సమానంగా ఆలపించబడుతున్న మరో ప్రపంచం, జగన్నాథ రథచక్రాలు, ప్రతిజ్ఞ—వగైరాది గీతాలు రాసిన శ్రీశ్రీ చేత సైతం— అర్థం అధ్వాన్నపు టడవిలో పారేసుకున్న పద్యాలురాయించింది ప్రయోగ వాదం మెచ్చదగిందే కాని ప్రయోజనాన్ని విస్మరించ కూడదు. వేదిక విస్తృతం కావడం కూడా సంతోష కరమే కాని—క్రిక్కిరిసిపోయి తన ఉనికికి భంగం తెచ్చుకోకూడదు. ఉదారవాదం కూడా కొంత మేరకు మంచిది కావచ్చునేమో కాని—పాలక వర్గాలతో పొందును బలపరచలేం. పీడితతాడితజనాలకు దూరం కావడాన్ని అంగీకరించలేం. సరిగ్గా ఈ వగైరా కారణాల చేతనే 'అభ్యుదయ రచయితలసంఘం'-'ఉచ్చవ రచయితల సంఘంగా' ఈ సడింపుల పాలయింది. తెలంగాణాలో చల్లారి పోయిన ప్రజా పోరాటం—సాహిత్యరంగంలో సైతం చల్లబడి చచ్చుబడిపోయింది.

ఆరుద్ర, అనిసెట్టి అబ్బూరి వరద, ఏల్చూరీ, సోమసుందర్, రెంటాల, కుందుర్తి, బైరాగి, బెల్లంకొండ—వగైరాది రెండవరకం కవులందరూ ప్రజా ప్రయోజనాన్ని కాపాడే వస్తువునే ఎంచుకున్నా—ప్రజలకు చేరువగా వుండే కవిత్వాన్ని పలికించలేక పోయారు. ఇందుకు కారణం అధివాస్తవిక కవితపై అరాధన వున్నంతగా అభినివేశం లేకపోవడం, మరీ ముఖ్యంగా చెప్పాలంటే ప్రయోగ వాదాన్ని వరించడం, మధ్యతరగతి వచన కవిత్వాన్ని పలవరించడం. ప్రజల నోటపట్టని ఏ పదమూ, ఏ పాటా పుస్తకాలు దాటి నిలవలేదన్న సంగతి ఇక్కడ గుర్తుంచుకోవాలి. అంచేత-ఒకడుగు ముందుకు, రెండడుగులు వెనక్కు అనేవాదం ఈ శతాబ్దం రెండవ సగంలోకి మళ్ళుతున్న దశలో రెండవసారి రుజువైంది. శతాబ్ది మొదటి పాదం ప్రాంతంలో 25-30ల నాటి భావ కవిత్వం గురజాడ జాడనుంచి దిగజారినపుడు. ఈ మాట మొదటిసారి రుజువయింది. ప్రజా పోరాటమే ఊపిరిగా, లక్ష్యంగా వారి ప్రయోజనాలను ముందు వరసలో నిలిచి కాపాడవలసిన కవికిశోరాలు-ఉడుకు చల్లారి (యౌవనం నిష్క్రమించగా, రక్తంచిక్కనై) ప్రభుత్వ యంత్రాంగాల్లోనూ, వెండితెరల వెనకా, అదీ ఇదీ కాకుంటే పాలకవర్గం కొమ్ముకాసే శతకోటి పరిశ్రమల్లో పత్రికల్లో—అనంతకోటి పన్నుచేస్తూ, రచనలు చేస్తూ-నెమ్మదిగా నేపథ్యంలోకి జారుకున్నారు. అప్పటికే 'మహాకవిత్వ' దశనందుకున్న శ్రీ శ్రీ పరిస్థితి సైతం ఇందుకు అట్టే భిన్నంగాలేదు. కాదూ కూడదంటే విదేశ కవిత్వాన్ని—మౌలికమైన స్వదేశీ రూపాంతరీకరిస్తున్నాడు. ప్రయోగవాద పద్యాల్లో ప్రజల్ని మరిచి పోలేదు.

"స్వాతంత్ర్యం ఇకదాలా సున్నితమైన పువ్వు
చాలా వాడైనకత్తి, విలువైన వజ్రం
స్వాతంత్ర్యం తెచ్చే వెన్నెన్నో బాధ్యతలు
సామర్థ్యంతో నిర్వహిస్తామని సంకల్పం చెప్పు
కుందాం"

అని తొలితొలి మువ్వన్నెల జెండా పండగనాడే స్వప్నించారు. ప్రభుత్వం పక్షంగానే అయినా—

'మనుష్యుడే నా సంగీతం
మానవుడే నా సందేశం'
అని ఆకాశం అంత ఎత్తు నుంచి చాటారు.

అందమైన చందమామతో కబుర్లలోకి దిగినపుడు సైతం—

"వెనుక తిరిగి చూచుకొనే
అలవాటే లేదు నాకు
అర నిముషం దాటేసరి
కదే నాకు గత శతాబ్ది"— అంటూ

"ఎలాగైనా నువ్వు మాకు
ఏక రక్త బంధువుడివి
నీతో కాకపోతే ఎవరితో

మా ఘోషలు చెప్పుకోవాలి" అని ఎంతో ఆత్మీయంగా ఆపుచేసి—

"ఇదిగోమాట! ఈ ప్రపంచంలో
ఇంకా ఎందరో అభాగ్యులున్నారు
పలకరించు వాళ్ళ చల్లగా
ధైర్యం చెప్పు వాళ్ళకి మెల్లిగా

ఆసుపత్రి కిటికీల్లోంచి నీ
కిరణాలను జాలుగా పంపించి
వ్యాధి గ్రస్తుల పాలిపోయినక పోలాలను
జాలిగా స్పృశించడం మరచిపోకు

జైళ్ళలో వున్నారు కొందరు
వాళ్ళని ఓదార్చక తప్పదు సుమా
నేరాలు చేశారు నిజమే
అందుకని అలక్ష్యంగా చూడకేం!

మురికి గుడిసెల్లో నివసించే
పరమ దరిద్రుల నుదుటి మీద
ఏ కన్నంలోంచో జాగా చేసుకొని
ఎలాగైనా పరామర్శ చేస్తావుకదూ

అని—ఈ సమాజపు విలువల ప్రకారం నేరాలు చేసన కొందర్ని, మురికి గుడిసెల్లో నివసించే పరమ దరిద్రుల్ని, వ్యాధిగ్రస్తుల్నీ-తన గుండెల్లోంచి పైకి తీసి చూపించారు. భావకవిత్వాన్ని, గ్రోలుతూ తల లూపే పండిత పుంగవుల్ని సైతం ఈ 'చంద్రుడితో కబుర్లు' కదిలించాయి.

'మేమే' పేర ఆరుద్ర, వరదల్ని చెరో చెయ్యిగానూ చేసుకుని కొంటి కోణంగి వేషాలు వేసినా, ప్రాసక్రీడల్లో కవిత్వాన్ని పల్టీలు కొట్టించినా— కలం కాలువిసిరి ఎక్కడ తన్నాలో అక్కడేతన్నాడు

పొడిచేస్తామని చెప్పిన
మనకాంగ్రెస్ వారు
తడిరాష్ట్రాలన్నింటినీ

"పొడి" చేస్తున్నారు- వంటిపోట్లు ఎన్నయినా పొడిచాడు. అయితే నమస్కరింపదగినవాళ్లకు అవశ్యం నమస్కరించాడు

భాషాశాసనచణుకై పరగినట్టి గిడుగు
తెలుగువారి వెలుగువారి వెలివెన్నెల మడుగు

అడుగుజాడ గురజాడది ఆదిబావికిబాట
మనలో వెధవాయత్వం మరిపించేపాట

ఈ రకంగా సాగిన వ్యంగ్యకవిత్వం అవశ్యంగా అన్నివర్గాలవారినీ అలరించింది. ఇదేకాదు- ఇంతకు

కొంతకాలం ముందు రచించిన 'సిరిసిరిమువ్వశతకం' ఎందరికో కితకితలుపెట్టింది. కొందరిని చితచితలాడిం చింది. రచనలోసాటిలేని రీతిగా సామాజిక విమర్శచేసి చూపించాడు శ్రీశ్రీ (రోజంకి)[8]

అయితే ఈ కవిత్వానికి 'మహాప్రస్థాన' గీతాలకు వచ్చిన 'ఉద్యమలక్షణం' రాలేదు ఇవన్నీ వాలుకుర్చీ వాలాల మెప్పునైతే పొందాయి గాని 'అధోజగత్సహో దరులను' అందుకోలేకపోయాయి. "గురజాడ 50సం॥ జీవించాడు. లినూ (50ఏళ్లు) 1960 వరకూ జీవిస్తాను అని తనగురించి తనే ప్రజాహృదయంలో నిలిచిపోగల కవిత్వంచెప్పేందుకు అకాలపరిమితి సరిపోతుంది అనే దృష్టితోకావచ్చు) జోస్యం చెప్పుకున్న శ్రీ శ్రీ సాహిత్యజీవితం ఆజోస్యం నిజంచేసి చూచోలేదుగాని- అబద్ధంచెయ్యగలిగినంత ఘనకార్యమూ ఆదరిమిలా చెయ్యలేదు.

ఇందుకు 'కారణం స్వాతంత్ర్యానంతరపు తొలి ఒకటిన్నరదశాబ్దకాలాన్నీ (సాంఘికరంగపు ప్రతి బింబంగానే) ఆవరించిన స్తబ్ధత అని చెప్పకోవచ్చు. మినుకు మినుకు కాంతులు లేకపోలేదు- మిరుమిట్లు గొలిపేకాంతులు మృగ్యమే అనవచ్చును.

పెదవుల సొగసుగానైనా మిగిలిన సామ్యవాదం, సోషలిజం క్షేమంత్రాలు నెహ్రూ నిష్క్రమణంతో (1664) పదినిలువుల లోతుకుపాతుకు పోయాయి. సామాజిక రంగమూ, రాజకీయ రంగమూ సరేసరి ఆర్థికరంగమూ కుక్కుకంపు కొట్టనారంభించాయి. దేశీ యాంగమూ, విదేశీయాంగమూ కూడా అంగాలుతెగిన అనాధస్థితికి దిగజారిపోయాయి. లోతుకల్లే సౌందర్యం అని నచ్చచెప్పేటటువంటి తత్వంతోతయారైన లోటు బడ్జెట్లూ, వికారమే సాకారమనిచెప్పే విదేశీ బడ్జెట్లూ, పంచకోలకషాయంవంటి పంచవర్ష ప్రణాళికలూ, పద వుల కుమ్ములాటకే పరిమితమైన ప్రతిపక్ష పక్షపాత రోగాలూ- పెచ్చుపెరిగి పోయాయి. ఆశ్రిత పక్ష పాతం, లంచగొండితనం, ఎన్నికల 'ఖాగోతం'"నామి నేషన్" సంస్కృతి, లాబీల్లో లాలూచీలు, అసమ్మతి వర్గాలూ, కుసమ్మతి వర్గాలూ- పెచ్చుపెరిగిపోయి "పట్టపరమైన పార్లమెంటరీ వ్యవస్థ" సైతం రోగ గ్రస్థమై పోయింది. సాహిత్యంలో- నామమాత్రపు అభ్యుదయసాహిత్యం సైతం అంతరించి పోయింది. 'స్వతంత్ర' సాహిత్యం అడుగంటింది. పాఠకుల్ని 'వంటయింటికో' కాదూ కూడదంటే "డ్రాయింగ్ రూమ్"కో కట్టిపడేసే లంగామార్కుసాహిత్యం విచ్చల విడిగా పీఢినపడింది మరి సినిమారంగమూ డిటో డిటో అంటే కుటుంబరావు చెప్పినట్టు- కనీసం సక్ర మమైన పెట్టుబడిదారీ వ్యవస్థసైతం మనకు కొర వడింది. ఫ్యూడల్ దశకు సంఘం మహోతిరోగమనం చిత్రగించింది.

ఈ దుస్థితిలో విసుగెత్తి వెర్రెత్తిన యువకులు ఆరు గురు- దిగంబరంగా ఈ వ్యవస్థపై విరుచుకుపడ్డారు కాయకల్ప చికిత్సలూ షాక్ట్రీట్మెంట్లూ కూడా పనికి రానిఈ సంఘానికి శస్త్రచికిత్సతప్ప దారిలేని దారుణ స్థితిని కళ్లఎదుట ఫోకస్చేసి చూపించారు. సంఘజీవి తపు సర్వరంగాల్లోనూ పుక్కి అశ్లీలాన్నీ బూతునూ బట్టబయలు చేశారు. 1965 మేలో అర్ధరాత్రి, ఆంధ్రులు రాజధానిలో, అట్టడుగు వర్గానికిచెందిన రిక్షావాలాచేత తొలిసంపుటి ఆవిష్కరించారు. అనంతరం రెండోదీ మూడోదీకూడా అవర్గపు వారిచేత (మూడవసంపుటి ఒక బిచ్చగత్తె ఆవిష్కరించింది.) తెరిపించారు ఈ 'దిగంబరయుద్ధం' 20వ శతాబ్దపు సాహిత్యచరిత్ర లోనే ఒక కీలకమైన ఘట్టం. అర్థవంతమైనమలుపు అనివార్యమైన మలుపు.

శ్రీశ్రీ దీన్ని ఆనందాంతరంగంతోనూ, ఆమోద ఆదరాలతోనూవీక్షిస్తే- అభ్యుదయ సాహిత్యనేతలు, విమర్శక యోధులూ- భీతావహులై సాహిత్యానికి సంక టకాలం దాపురించిందని గుండెబాదుకున్నారు. దిగం బరులకు అసంతృప్తి సక్రమమైనదే అయినా, దాని

వెనుక బలమైన రాజకీయ అవగాహన కొరవడిందని కొందరు సక్రమంగానే అభిప్రాయపడ్డారు. అన్ని వర్గాల్లోనూ సంచలనం చెలరేగింది.

ఇది ఇలావుండగా నక్సల్బరీకల్లోలానికి సమాంతరమైన కదలి తరంగం శ్రీకాకుళాన్ని కదిలించి వేసింది. ప్రజా ఉద్యమం విముక్తిదిశగా ప్రయాణం ప్రారంభించింది. ఈ ఉద్యమతరంగం- రాజకీయ రంగాన్ని మరింతగా కల్లోలపరిచింది కాసులుమూటగట్టిన కామందులూ, రక్తం రుచిమరిగిన జలగలూ, ఊడలు దింపుకున్న జడల మర్రిచెట్లూ , పడగలువిప్పి బుసలు కొట్టాయి. విషం కక్కాయి. ఫలితంగా విముక్తి పుష్పాలు మెగ్గలోనే మాడిపోయాయి. పోరాట ఫలితాలకు పురిటిలోనే సంధి కొట్టింది అపజయం విజయం కాకపోయినా-విజయానికి తప్పని సరిమెట్టు

ఈ నేపథ్యంలో 1970లో శ్రీ శ్రీ షష్టిపూర్తి జరిగింది. కవిగా శ్రీ శ్రీ స్థాయిలో—అది ఒక కొత్త మలుపు. సప్తఋషి మండల సన్మానాన్ని దాటి — దిగంబరకవుల, తిరుగుబాటు మార్గమే సరైనదనినమ్మి అగ్రగామిగా నిలబడేందుకు ఉద్యమించాడు విప్లవ రచయితల సంఘానికి అధ్యక్షుడుగా - అడుగు ముందుకే వేశాడు.

ప్రాచీన ఛందస్సును పట్టించుకోకపోయినా, లిరిక్ రీతిలో అత్యద్భుతంగా రచించిన మహాప్రస్థాన గీతాల్ని మెచ్చుకున్న లోకం-శరశ్చంద్రిక, సదసత్సంశయం, ప్రాసక్రీడలు, విముఖుక్షులు—వంటి కవితలనూ— ఆయా కవితల వెనుకగల వ్యంగ్య వైభవాన్నీ మెచ్చిన లోకం—ఫ్రెంచ్, లాటిన్. ఇటాలియన్, స్పానిష్, బ్రిటిష్, అమెకన్ మహాకవులకు అనువాదాలనిపించినంత గొప్ప రచనల్ని చదివి మురిసిన లోకం—

కలాన్ని ఆయుధంగా ధరించిన శ్రీశ్రీని మెచ్చలేక పోయింది. ప్రజా పోరాటాన్ని బలపరచిన శ్రీశ్రీని బలపరచక లేకపోయింది. శ్రీశ్రీలోని వేడినీ, వాడినీ. గుర్తించడానికి తిరస్కరించింది. శ్రీ శ్రీ చేతబట్టిన విరసం అరుణ పతాకాన్ని చూసి అదిరిపోయింది- విశ్వనాథులూ నోరి శాస్త్రిలూ— ఈ 'కొత్తగాలి'ని నిలవరించ వలసిందే, నిషేధించవలసిందేనన్నారు రక్తంతాగే రాకాసి పులులకు కూడా పగటి వెలుగు పడదు. గుడ్లగూబలు సూర్యోదయాన్నెలా చూడగలవు? తిరుగుబాటుతప్ప మరొకదారి లేని పీడిత జన సమూహం ముందు నిలిచి—శ్రీ శ్రీ గొంతెత్తి ఝంఝా గీతం పాడాడు.[9]

ఘోషించాను
మంచిగా ఉండద్రా అంటూ .
గోల పెట్టాను
అమాయకులజోలికి పోకండ్రా అంటూ.

కల్మషాలని మానసాలలోంచి
కలిగేసుకోండ్రా అన్నాను
కళ్ళల్లో కాంతులు
పోగేసు కొమ్మన్నాను
గతాన్ని నెమరేసుకోవడం
మానేసు కొమ్మన్నాను
మొరపెట్టాను
మొత్తుకున్నాను.
విన్నారు కాదు
వేలాడుతున్నారు
భూతకాలం చూరుపట్టుకుని,
విలువలకి వింత వ్యాఖ్యానాలు చేస్తున్నారు

పాతని బతికించడానికి
కొత్త చిట్కాలు వెదుకుతున్నారు
కొత్తని హతమార్చడానికి
పాత కత్తులు నూరుతున్నారు
ఊరుకుంటానా నేను
కసిగాకసాయిగా

ఉపద్రవంలాగ ఉవ్వెత్తుగా లేచి
సంహారాన్ని స్యందనం చేసి
ఉద్రేక తరంగాలే తురంగాలుగా
ఆగ్రహం కొరడాని చేబూని
సాయుధ విప్లవ భీభత్సుని సారథినై
భారత కురుక్షేత్రంలో
నవయుగ భగవద్గీతా ఝంఝుని ప్రసరిస్తాను
మంటలచేత మాట్లాడించి
రక్తంచేత రాగాలాపన చేయిస్తాను.

పోరాటాల చరిత్ర ఒక ఎత్తూ, శ్రీశ్రీ రచనా నాయకత్వం మరొక ఎత్తూగా విరసం పురోగమించింది. నగ్నముని, జ్వాలాముఖి, చెరబండరాజు, వరవరరావు వంటి కవులను శ్రీ శ్రీ తయారు చెయ్యలేదు కాని వారితో కరచాలనం చేశాడు. ఆ కరచాలనం ద్వారా వారికి వెయ్యి విద్యుత్తుల బలాన్నిచ్చాడు.

విముక్తి పోరాటాల్లో వీరమరణం పొందుతున్న వారిని తలచి—

"ఊగరా ఊగరా ఊగరా
ఉరి కొయ్య అందుకొని ఊగరా

నువ్వూగుతుంటె శత్రువుల గుండె గాభరా" అని ఉద్వేగ గానం చేశాడు [10] ఉవ్వెత్తుగా లేస్తున్న యువతరంగాలను 'లే' [11]లెమ్మని లేపి వెన్ను తట్టి 'గమ్యం' [12]దిశగా నడిపించాడు. కొత్తగా వీచే ప్రతి 'తూర్పు గాలి[13]కి ఆహ్వానం పలికాడు. ఇక్కడే అందరి వంతుగా విప్లవ కవితా ఝంఝు'ని విజృంభింపజేశాడు. 'క్రాంతియుద్ధాలు[14] రగిలించాడు. ఒక 'వంజెట్టీని', ఒక 'గువేరా'నీ తెలుగువాళ్ళకి బోధపరిచాడు. తానొక విప్లవ చైతన్యపు 'దిక్సూచి'గా నిలిచాడు

చరమరాత్రి వగైరా కథలు రాసినా, వారం వారం వ్యాసాలు రాసినా, చతురస్రాల వంటి గేయ నాటికలు రాసినా శ్రీశ్రీ ప్రధానంగా కవి అనే సంగతి గుర్తించుకోవాలి. అందునా పట్టణం కవి. పుస్తకం పట్టుగల వాళ్ళను సామాజిక చింతనలోనికి, చైతన్యం వాలుకి 'పరివర్తనం' చెందించగల చాకచక్యంగల కవి. కదిలించి, పెనునిద్దుర వదిలించగల నేర్పరి

శ్రీ శ్రీ పల్లెలో పెరిగినవాడు కాదు. Urban mediumలో తప్ప folk mediumలో ఒక్క రచన కూడా చెయ్యలేదు.

"నిజంగా జానపద సాహిత్యం యిచ్చిన వుత్తేజంతో గురజాడ రచనలు చేశాడు. నేను పల్లె వాతావరణం తెలిసిన వాణ్ణికాను. పట్టణాల్లో పెరిగిన వాణ్ణి అందువల్ల జానపద పద్ధతిలో కవిత్వం రాయలేను వంగపండు గద్దర్ ఉత్తమ కవిత్వం రాస్తున్నారు "అని ఇంటర్వ్యూలలో స్పష్టంచేశాడు [16] కాళీపట్నం రామారావు, భూషణం వంటి కథకులే ఉద్యమ సాహిత్యానికి భూషణాలనీ, రావిశాస్త్రీయ సాహిత్యం" మూఢ విశ్వాసాల మీద బిగించిన పిడికిలి ఎత్తుతుందనీ— వారి కృషి ఫలితంగానే ఈ మహాయజ్ఞం కొనసాగి తీరుతుందనీ కూడా నిర్ద్వంద్వంగా చాటి చెప్పాడు.

ఈ శతాబ్దిలో శ్రీశ్రీ కంటె ఎక్కువగా విప్లవాన్ని ఆహ్వానించిన కవి మరొకడులేడు. రష్యా వెళ్ళి వచ్చినా ఆదేశాల్లో వచ్చిన విప్లవాలు మనదేశంలో కూడా వస్తే బావుణ్ణని, ఆశాభావంతో కలలుకన్నాడు. ఇంగ్లండ్ వెళ్ళినా అమెరికా వెళ్ళినా తియ్యని తన మాతృ భాషలోనే విప్లవం గురించి పలవరించాడు.

"2001సంవత్సరానికి ముందే విప్లవం వస్తుందా? అనే ప్రశ్నకు—

నేను ఆశావాదిని. ఇంకా ముందే వస్తుందని అనుకొంటున్నాను. నా జీవిత కాలంలో విప్లవాన్ని చూడా

లని నా కోరిక" అన్నారంటే విప్లవాన్ని ఎంత గాఢంగా ప్రేమించిందీ స్పష్టమౌతుంది.[17]

కాని—అంతటి శ్రీ శ్రీలో సైతం ఎంతో కొంత మధ్యతరగతి అజ్ఞానం లేకపోలేదని గుర్తొస్తే మనసు చాలా మథనపడిపోతుంది. అతి సామాన్యులు సైతం రహస్యంగానైనా వ్యతిరేకించిన ఎమర్జెన్సీని-వామపక్ష నియంతృత్వం అనుకున్నానని అన్నాడంటే—ఆ అజ్ఞానం ఏస్థాయిలోదో సులభంగానే అర్థంఅవుతుంది.

ఆధునికాంధ్ర కవిత్వానికి గురజాడ జాడ తిరుగు లేనిదని చెప్పిన నోటితోనే—నేర్పుగా ఆ మాట దాటించి, వేగుంట చేసిన తప్పుడు రాతని వలపరచి—తానే అధునికాంధ్ర సాహిత్యానికి పితామహుడి నన్నాడు. ఎవరెక్కడ ఏ రూపంలో సన్మానం చేసినా వారి సిద్ధాంతాన్ని బలపరచక పోయినా—వారి ఉబ లాటాన్ని కాదనకుండా వెళ్ళి శాలువాలు కప్పించుకుని వచ్చాడు. ఈ పన్నులన్నీ అభ్యుదయ కవితానేతల్లో అగ్రస్థాయిలో వుంటున్న దశలోగాని, సంపంగె తోట సందడిలో పడిమునిగిన రోజుల్లోగాని చేసినవికావు, విరసం కాలమానంలో చేసినవే. తనలోని విదూష కత్వాన్నీ, వ్యక్తిగత బలహీనతల్నీ తానే గుర్తించక పోలేదు. ఈ రకం పొరపాట్లు అటు కుటుంబరావుగారి వంటి పెద్దలూ చెయ్యలేదు. ఇటు చెరబండ రాజు వంటి చిన్నలూ చెయ్యలేదు. కనుక వారిది కళంకం లేని కీర్తి. అయినా శ్రీ శ్రీకి వచ్చిన కీర్తి అంతకంటె జగజ్జేగీయమానమైనది. ఖండాంతరస్థాయినందుకున్నట్టి అఖండమైనది. అంచేత ఈ కళంకాలు చంద్రుడిలో మచ్చల వంటివికావు. సూర్యుడిలో మచ్చల వంటివి. లెక్కకు మిగిలినా లెక్కలోకి రానివి. ఎన్ని మచ్చ లున్నా కనపడనంత కాంతి సూర్యునిది. ఆకాశంలోకి ఎగిసే ఆ జ్వాలల వేడి చల్లారనిది. మహా కవిత్వా కాశంలో ఆకాంతాలనందుకున్న విప్లవ సూర్యుడు శ్రీ శ్రీ.

శ్రీశ్రీకి ముందు ఆంతాహూన్యం అనే మాట అబద్ధం. "నేను ఆశాజీవిని. నా తరువాత నాకంటె గొప్ప కవిత్వం రాసేవాళ్లొస్తారు" అని మహాభినిష్క్రమణా నికి మూడు నెలల ముందే (రాజధాని నుండి) ఆకాశ వాణిలో[18] మహాశయించి-లాంగ్ మార్చ్ చేశాడు. ఆచరణా నిమ్నగతతో దారితో మున్ముందుకు సాగడం ఒక్కటే మన అవశ్యకర్తవ్యం.

—[రచన :జులై 15, 1983]

## వివరణములు :

1. వర్తమాన తరంగిణి 2. హాస్య సంజీవని-కందు కూరి వీరేశలింగం గారు సంఘం సంస్కరణ ప్రధా నాశయంగా 1880-1910 నడిమికాలంలో రాజమండ్రి నుండి నడిపిన పత్రికలు. 3. 1930లలో ప్రపంచం తీవ్రమైన ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొంది. ఈకాలాన్ని Hungry thirties అనీ Depression Period అని అంటారు. మహాప్రస్థాన గీతాలకు ఈ దశాబ్దమే నేపథ్యం 4. ఇంగ్లండులో మన భారతీయ విద్యార్థులు స్థాపించిన అభ్యుదయ రచయితల సంఘం వారి అర రావు మేనిఫెస్టో ఇండియాలోకి స్మగుల్ అయ్యింది. దాని కాపీ (ప్రతి) ఒకటి అబ్బూరి రామకృష్ణారావు గారు యిచ్చారు. అది చదవగానే ప్రతిజ్ఞ (పొలాలనన్నీ హలాలదున్నీ...) అనే గేయం రాశాను. (శ్రీ శ్రీ వ్యాసాలు. (1970-83) విరసం ప్రచురణ పేజీ193) 5, 6 శ్రీశ్రీ వ్యాసాలలో-పదవభాగం 'ఇంటర్వ్యూలు'

7. మహాప్రస్థానం లండన్ ఎడిషన్‌కు శ్రీశ్రీ రాసిన ముందుమాట 8 ఆంధ్రునికాంధ్రసాహిత్యంపై రోణంకి వారు దఱను వరుసగా వ్యాసాలు రాశారు. అన్నిట్లోనూ శ్రీశ్రీ ప్రసక్తి వుంది 9. మరో ప్రస్థానంలో 'ఝంఝ' అనే కవిత-రచన1970) 10. అదే పుస్తకంలో 'తుది పయనం :తొలి విజయం' అనే గీతం 11. లే-విరసం తిరుపతి యూనిట్ వారి కవితా సంకలనం 12. గమ్యం14, కాంతి యుద్ధం,16 దిక్సూచి- చెరబండ రాజు కవితా సంకలనం 13. తూర్పుగాలి-నగ్న ముని కవితా సంకలనం 16, 17. శ్రీశ్రీ వ్యాసాలలో-ఇంటర్వ్యూలు 18. 1983 మార్చిలో హైదరాబాద్ రేడియో కేంద్రం నుండి చేసిన ప్రసంగంలోని వాక్యాలు.

కోటవీధి
చోడవరం
విశాఖ జిల్లా.

## తృతీయ ప్రపంచ హిందీ మహాసభలు

### న్యూఢిల్లీ

1983 అక్టోబరు 28, 29 30 తేదీలలో తృతీయ ప్రపంచ హిందీ మహాసభలు న్యూఢిల్లీలో జరుపుటకు నిర్ణయం జరిగింది. భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీగారు పై మహాసభలకు ప్రారంభోత్సవం చేయుటకు అంగీకరించారు. ఆంధ్రప్రదేశ్ నుంచి నిర్ణయించిన సంఖ్యకంటె ఎక్కువ మంది ప్రతినిధులు పై మహాసభల్లో పాల్గొంటున్నారని తెలుపుటకు సంతోషిస్తున్నాము.

సంపాదకుడు

# మధుధారలు- కవిరాజమూర్తి

-హీరాలాల్ మోరియా

చరిత్రకు అందని కాలంలోను, అందిన కాలంలోను ప్రతియుగంలోను ప్రతి దేశంలోను మానవసమాజంలో ఎందరో గొప్ప వ్యక్తులు జన్మించారు. వీరందరూ వివిధ రంగాలలో ప్రసిద్ధులు. సాహిత్యానికి సంబంధించినంత వరకు ఎందరో మహానుభావులు ప్రపంచంలో తమ ప్రతిభా సంపత్తిని వెలయించిన వారున్నారు. అలాంటి వారిలో కొందరి పేర్లు కూడా బొత్తిగా తెలియని అజ్ఞాత కవులు సాహితీ పరులు, కళా వేత్తలు వున్నారు అయితే సాహిత్య రంగంలో వారి స్థానం, వారి కవితా ప్రస్థానం మటుకు మహోన్నతంగా, మహోజ్వలంగా విరాజిల్లుతూనే వున్నది. ఈ మహామహుల, ఈ కవితా కళా తపస్వుల కవితా మధుధారలచే కావ్య సరస్వతి సర్వాలంకార శోభితయై విరాజిల్లినది.

ఉర్దూ సాహిత్యంలో ఇటువంటి పేరు తెలియని అజ్ఞాత కవిమూర్ధన్యుల సంఖ్య ఎక్కువగానే వున్నది. వారి సాహిత్య వారాశి నుండి వెలువడిన యెన్నో అనర్ఘ రత్నాలు నేటికీ తరగని దివ్య కాంతుల్ని వెదజల్లుతూనే వున్నవి. అయితే ఆ కవులెవరు? ఎక్కడివారు? వారు ఎలా జీవించారు?...ఎప్పటి వారు? అన్న విషయం నాటికీ ఈ నాటికి అజ్ఞాతంగానే వుండి పోయింది. కవితాభిమానులమైన మనకిది తీరని బాధాకరమే ఆయినా వారు ఉండి వున్నారు. అనే వాస్తవం మనకు కొంత వరకు ఊరట కలిగిస్తుంది.

అతిలోక సౌందర్య కళా నికేతనాలని ఈ నాటికీ మనం ఘనంగా చెప్పుకుంటున్న అల్లోరా, అజంతా గుహల్లోని కళాఖండాలను సృష్టించిన వారెవరు? ఎంత మంది? వాళ్ళ పేరు ప్రఖ్యాతులేమిటి? అన్నదానికి ఎవరు ఏం చెప్పగలరు? అదే విధంగా ఖజురాహో, రామప్ప, తాజ్‌మహలు మొదలైన అనశ్వర కళా ఖండాలను సృష్టించిన శిల్పవరులెవరు? పేర్లు తెలియక పోతే సరే అంతటి అపూర్వ కళా సృష్టిని వెలయించిన వారు కనీసం తమ రూపాలనైనా చెక్కుకున్నారా? అదీ లేదు. వారు కురూపులా! సురూపులా, పొట్టివారా! పొడుగరులా! రంగేమిటి! రూపమేమిటి? అనాధులా! శ్రీనాధులా! ఏమీ తెలియదు. అయినా కళాభిమానులు, వారి కళా నైపుణ్యాన్ని తిలకించి, ముగ్ధులై నిత్య నివాళులర్పిస్తూనే వున్నారు. ఇటువంటి కళా సృష్టికి కర్తలైన వాళ్ళను ప్రతివారు కనీసం తమ భావనా పథంలోనైనా చూడాలని తహతహ పడుతూ వుంటారు వాళ్ళ భౌతిక శరీరాలు లేకపోయినా, వాళ్ళు సృష్టించిన కళారూపాలలో వాళ్ళ సౌందర్య స్నిగ్ధమైన కళాత్మ జీవకళ లీనుతూ ప్రతి ఫలిస్తూ వుండడం, చూపరుల అంతరాంతరాల్లో చెరగని ముద్రవేస్తూ వుండడం మాత్రం తథ్యం. మనసులోనే వారి కళా భిజ్ఞతకు, కళా నిష్కృతికి నీరాజనాలు సమర్పించుకుంటూ వుంటారు. ఇదే ఉత్తమ కళకు ఉన్న ప్రత్యేకత—

వాస్తవంలో కళాకారుని ప్రత్యేకత కళను బట్టే వుంటుంది కదా! అయినప్పుడు కళాకారుని కంటే కళకే పూజ్యత, ప్రాజ్యతలభిస్తుందని చెప్పుకోవడం తప్పు కాదు. అంత వరకు వస్తే కళాకారుడూ మానవ మాత్రుడే

చరా చరాలతో నిండినిబిడీ కృతమైన ఈయనంత సృష్టికి కర్త యెవరో మనం చూడలేదు చూడలేము. అందుకే పెద్దలు ఈ సృష్టికి కర్త, భర్త, హర్త, ఈశ్వరుడని అన్నారు. ఈశ్వరుణ్ణి మనం చూడలేము. ఎవరూ చూడలేదు. అతడు సృష్టించిన సృష్టిని మాత్రం చూస్తున్నాము. ఇది యాతని మహత్తర చిద్విలాసం. ఈశ్వరుడి లాగనే కళాకరుని సృష్టికూడ.

ప్రముఖ విద్యావేత్త శ్రీ బి. వి కేస్కర్ ఉర్దూ మహాకవి ఖాజీ నజ్రుల్ ఇస్లాం కవితా సంపుటికి ఉపోద్ఘాతం వ్రాస్తూ "ప్రపంచ సాహిత్యంలో ఎందరో మహనీయులు జన్మించారు. ఎన్నో ఎన్నో గొప్ప రచనలు చేశారు. కాని వారిలో కొందరి ఊరూ, పేరూ యింత వరకు ఎవరికీ తెలియదు" అని

తెలుగులో మంచి ఒరవడి, ఉరవడి వున్న అసదృశ సాహితీ మూర్తి శ్రీ కవిరాజ మూర్తిగారు, ఉర్దూ సాహితీ ప్రపంచంలో పేరు తెలియని కొందరు అజ్ఞాత కవి పుంగవుల కావ్య ఖండికల్ని ఇటీవల తమ సహజ సుందరమైన తెలుగు భాషలోనికి అనువదించారు, ఈ అనువాద ముక్తకాల్ని చదువుతూ వుంటే ఆ పాత మధుర స్ఫురణ కలిగి చదువరుల హృదయాలు ఉవ్వెత్తున ఎగసి సంతోషోత్సాహాలతో పరవశిస్తాయి. భావనిశ్చలతతో పాటు, భాషా సౌష్ఠవం వున్న ఈ ముక్తకాలు ఈ కవిచేతిలో యెంతో అందంగా రూపొందాయి. ఇందలి ప్రతి ముక్తకం జీవిత సత్యాన్ని, కళా గరిష్ఠతను, గంభీరతను చాటుతూ వుంటుంది. ఆ అజ్ఞాతకవులు యెంతటి గంభీర భావుకులో, ఎంతటి రసావిష్కార కుశలరో, మనకు ద్యోతకం అవుతుంది. వాస్తవ జీవితంలో వారెంత విస్పష్టమైన అనుభవశాలురో మనం ఊహించవచ్చును ఈ కవులు కేవలం అగ్రశ్రేణికి చెందిన కవి సత్తములే కాదు. ఎంతో దూరదృష్టి, గొప్ప తాత్విక స్ఫూర్తి కలిగిన వారుగా గోచరిస్తారు. అయితే వారికి తమ పేరు ప్రఖ్యాతుల పట్ల ఏ మాత్రం ఆసక్తి వున్నట్లు తోచదు.

అకాశమంత విశాలత, సముద్రమంత గంభీరత వున్న వారుగా ఈ అజ్ఞాత కవులు తమ కవితల ద్వారా దర్శనమిస్తారు అంతేకాదు, వారెంత మానవతా వాదులో, తోటి మానవుల పట్ల కష్టాల పట్ల ఎంత బాధా విల హృదయులో మనకు తెలియగలదు నిఖిల మానవాళి బాధామయ జీవిత రహస్యాలను, తమ తాత్విక పరిధి లోనికి లాగి, వారు తమదీ అమృత మధుర వాక్సుధా పుంజంలో నిక్షిప్తం చేశారు మానవుని ప్రజ్ఞా విశేషాల మెరుపులు, క్షత విక్షతులు అన్నిటినీ సూటిగా, స్పష్టంగా, సుళువుగా పఠితలకు సన్నిహితంగా చెప్పి చూపారు

మిత్రులు శ్రీ కవిరాజ మూర్తిగారు అజ్ఞాతకవుల కవితా ముక్తకాలను తెలుగు చేసేటప్పుడు, మూలకర్తలైన ఆ మహా మహోజ్వల గంభీర కవితా భావు తను ప్రత్యక్షర ప్రత్యక్షంగా శ్రమించి సాధించారు. ప్రతి పద్యం యొక్క అనువాదం మూలానికి వలెనే హృదయలక్షితమైన బాణంవలె పాఠకుని లోనికి దూసుకు పోతుంది ప్రతి ముక్తకం మేధను కదలి చి వేస్తుంది. వీటిని చదివిన చదువరుల మేధస్సు ఆశ్చర్య చకితమై అనుభూతి దిశలకు పరుగెడుతుంది.

ప్రముఖ ఉర్దూ విద్వాంసుడు అహ్తషహద్ ఒక వ్యాసంలో ఉర్దూ గజలు ప్రాశస్త్యాన్ని గురించి చెబుతూ "ఉర్దూ సాహిత్యంలో 'గజలు' ప్రక్రియకు ఒక పత్యేక స్థానం వున్నది. మానవ జీవితానికి సంబంధించిన విభిన్న అంశాలు చిన్నవీ, పెద్దవీ అనే తారతమ్యం లెకుండా అన్నీ ఇందులో ప్రతిబింబిస్తాయి." అని అన్నారు. ఉర్దూ భాషలో అజ్ఞాత కవులు చెప్పిన ప్రతి ఒక ఖండిక దివినప్పుడు తప్పని సరిగా మన మేధస్సు మాధురీ సంపన్నమైన ఆలోచనా గర్భ కుహరాంతరాళంలో విహరించి తీరుతుంది. వీనిలో నిబిడీకృతమై వున్న ప్రతిభా భావ

సందోహం విలువ ఇంత అంత అని లెక్కకట్టలేము. వీటిని చదువగానే "అహో! ఇవెంత గొప్పవి! ఎంత రసోపేతమైనవి" అని మాత్రం ఆశ్చర్యం ప్రకటించ గలం. ఆ కవితల పొందిక, పదాల అమరింపు, అలంకార సౌందర్యం, ఉన్నత భావావిష్కరణ వీటన్నిటి సమాహారమైన గంభీరత, క్లుప్తత, గుప్తత అన్నీ మనల్ని చకిత పరిచి ఆకట్టుకుంటాయి. ఆ విధంగా ఇందలి ప్రతి ముక్తకం దేనికదే ప్రత్యేకతను సంతరించుకున్న ముక్తామణి.

శ్రీ కవిరాజ మూర్తిగారు తెలుగు చేసిన ప్రతి ఖండిక ఒక్కొక్కటి ఒక్కొక్క కోహినూరు. జీవితంలోని ప్రతి ఆవస్థను ఏదో విధంగా తడుముతూనే వుంటాయి. మన సాఫల్యాలను అభినందిస్తూ, మన వైఫల్యాలను సున్నితంగా, సుకుమారంగా, సునిశితంగా, వ్యంగ్యంగా వేలెత్తి చూపుతాయి. విరగబడి నవ్వుతాయి. మనల్ని నవ్విస్తాయి. ఏడిపిస్తాయి. చివరకు సమాశ్వసించి వీపుతడుతాయి కూడా. నిజంగా యీ కవితా ముక్తకాల్లో దేనికదే సాటి. దేనికదే ప్రస్తుతి పాత్రము.

మూలానికి వన్నె తెచ్చే అనువాదమే నిజమైన అనువాదం. ఈ పని మూర్తిలాంటి ప్రతిభాగరీయులైన మహాకవులు మాత్రమే చేయగలరు. ఉర్దూ తెలుగు సాహిత్యాల్లో శ్రీ మూర్తికి అసాధారణమైన అభినివేశం వున్నది. రచనా కౌశలం వున్నది. ఆయనలో ఈ ఈ రెండు భాషల తాలూకు కవితా కళా సౌరభాలు సమంగానే పరిమళించాయి. మనోజ్ఞమైన, మహోన్నతమైన జీవిత సత్యాలను, తీపి చేదుల్ని ఈ చిన్ని పుస్తకంలో నిక్షిప్తం చేశారు. ఉర్దూలోవున్న ఈ గేయాల మాతృకల్ని కూడా నేను చూచాను. అయితే ఈ ఖండికలు అన్నీ కేవలం అజ్ఞాతకవులవే అనడానికి వీలులేదు. కొద్ది మంది జోష్, జఫర్, గాలిబుల వంటి ప్రముఖ కవులు కూడ వున్నారు. వాటి మూల సౌందర్యానికి భిన్నంగా ఈ కవి యెంత మాత్రంపోలేదు. వియోగం, విషాదం, ఆనందం, భయం, ఆందోళన ఉత్సాహం, ఉద్వేగం అన్నీ మనల్ని కదిలించి కలచి కరుణలో పర్యవసింపజేసి అనుభూతి రెక్కలతో కళా శిఖరాగ్రల మీద విహరింపజేస్తాయి. కొన్ని కవితలు మళ్ళీ మళ్ళీ చదువడానికి పురి కొల్పుతాయి

డా॥ సయ్యద్ ఇక్బాల్ హుస్సేన్ అనే అతను ఒక వ్యాసంలో కళను గురించి వ్రాస్తూ "కళ అనేది కళాకారుని స్వీయానుభవాల ప్రతిస్పందిగా ఆవిష్కృతమౌతుంది. అది ఆవేశపూరితం కావచ్చు. లేదా మేధో విలసితం కావచ్చు. దానికి భూత, భవిష్య ద్వర్తమానాలతో నిమిత్తం లేదు. రేపటిని గురించి కళాకారుడు ఇవాళ ఒక కలగన్నా అది ముందు నాటికి యధార్థ విషయ సంపన్నం కావచ్చును". అని పేర్కొన్నారు.

ఈ భావాలే యథాతథంగా సాహిత్యానికి కూడా అన్వయిస్తాయి. సాహిత్యంలో ఒకానొక కాలంలో ఒక ప్రత్యేకమైన రీతి ప్రవర్తిల్లి వ్యాప్తిలోనికి వచ్చిదంటే అందుకు తత్కాలీనమైన వాస్తవికత, మరియు మారుతూన్న కళా సౌందర్యం యొక్క స్పష్టమైన రూపం ఆ సాహిత్య కారునికి లేదా కవికి నిర్దిష్టంగా సాక్షాత్కరించిన దన్నమాటే;

ఉర్దూ భాష హిందూ దేశంలో జన్మించి, హిందూ మహమ్మదీయుల సంస్కృతీ సభ్యతల ఆదరణలో భారత దేశంలో పరిపుష్టినందింది. అయితే ఈ భాషా కవుల కవితా రీతుల్ని ఆదిలో పరిశీలిస్తే స్త్రీ పురుష ప్రేమ పరమైన శృంగార కవితగా గోచరించే మాట వాస్తవం. అందుకు తెలుగులో దక్షిణాంధ్ర యుగం,

అంతకు ముందు ప్రబంధ యుగంలోవలెనే ఉర్దూలో కూడ, ఆనాటి ప్రభువుల శృంగారరస పోషణాభిరుచి తత్కాలీనమైన ప్రజల సుఖజీవన సుస్థిరతలే కారణమై వుంటుందనక తప్పదు. ఏమైతేనేం తరువాత కాలాల్లో ఉర్దూ కవిత ప్రాచీన శృంగార సన్నికర్ష నుండి బయటపడి ఆధునాతన మానవ జీవిత సమస్యలపట్ల మొగ్గు చూపి, తన పరిధిని విస్తృతం చేసుకున్నది. ఉర్దూలో 'గజలు' అనే పదానికి స్థూలంగా 'స్త్రీ'తో సంభాషించడం అని, స్త్రీ సౌంధర్యానికి సంకేతమని కదా! ఉర్దూ సాహిత్యంలో ముఖ్యంగా, 'షరాబ్, షబాబ్', (అనగా మద్యం, సౌందర్యం), సాకీలకు విశిష్టమైన స్థానాన్ని కవులు కల్పించారు. వారి దృష్టిలో ఇవి కేవలం శృంగార పరంగా కాక, మరో విశిష్టార్థానికి, భావానిక సంకేతాలే తప్ప, ఆయా శబ్దాల అర్థాలను బట్టి ఊహించడానికి వీలులేదు.

కవి, గాలిబైనా కావచ్చు, తులసీ అయినా కావచ్చు. వేరె వరైనాకావచ్చు. ఎవరైనా ఏ భాషకు చెందిన వారైనా వారి దృష్టి సౌందర్యజుష్టమై వుంటుంది. అతని యావ జ్జీవితంసౌందర్యాన్వేషణలోనే సాగిపోతూవుంటుంది. ఆ మహాగమ్యాన్ని సాక్షాత్కరింప జేసుకోవడంలోనే మహాకవి తనసర్వశక్తుల్ని వినియోగిస్తాడు.సౌందర్యం యొక్క గుర్తింపు ప్రేమ. శ్రీ మూర్తిగారి సహజ వృత్తి భాషతో నిమిత్తం లేని ఆయన స్వీయానుభవాల పరిమళాల సోయగం యిందులో తప్పక చోటు చేసు కున్నట్లు ఆయన నెరిగిన వారు గమనించకపోరు ఈ "మధుధారలు" తెలుగు కావ్యం నిండా అజ్ఞాతంగా ఆవేశించి ఉన్న అజ్ఞాత కవులకు శ్రీ మూర్తి శాశ్వత త్వం కలిగించారు. తెలుగు కవితాలోకంలో ముఖ్యంగా ఇతర భాషల నుండి తెలుగులోనికి అనువదింపబడిన ప్రసిద్ధ భాషా కవుల కవితా సంపుటిలో ఈ "మధు ధారలు" కావ్యానికి తప్పకుండా ప్రత్యేకస్థానం లభించ గలదని ఆశిస్తున్నాను. ఆ కవుల కమనియ భావుకతకు నీ రాజనాలర్పిస్తూ శ్రీ కవిరాజు మూర్తిగారి కృషిని నేను హృదయ పూర్తిగా అభినందిస్తున్నాను

"నేను బ్రతికుండగా నన్నెవరేమీ చేయలేరు
అందుకే నా చావు కొఱకు అంగలార్చారు
అయినా నా శతృవు సాధించిందేమిటి?
చచ్చి కూడా నలుగురిపై సవారీ చేశాను."

పై పద్యపాదాలు ఆయన చెప్పిన అజ్ఞాతకవివే అయినా శ్రీ మూర్తిగారి క్కూడా పూర్తిగా అన్వ యిస్తాయి. ఇంత సాధికార స్వాధికార పరుడీయన.

నాగరిక ప్రపంచములో మానవ సమాజాన్ని మరింత తేజస్వంగా, ఉత్తేజితంగా, స్నేహసౌహార్ద కలితంగా తీర్చిదిద్దడానికి సాహిత్య కళారంగాలు, తదనుగుణమైన నవీనతను సంతరించుకుంటూ కొన సాగుతున్నాయి. తక్కిన భాషల మాటటుంచి ఉరుదూ కవులు తామే విషయాన్ని ప్రతిపాదించినా నేడు మనం ఆశిస్తున్న సామాజిక స్పృహ లేక చింతనకు దోహదం చేసే క్రాంతదర్శిత్వం ప్రదర్శించినారని చెప్పక తప్పదు. గంభీర భావుకతకు, క్లుప్తతకు, పదలాలిత్యా నికి, రసశాలిత్వానికి దానికదే సాటి యనిపించుకున్న ఉర్దూ కవుల కమనీయ, రమణీయ భావుకతకు శ్రీ మూర్తిగారి యనువాదం తుల్య భాషా భావదీప్తి స్ఫోర కమై చదివినకొలది చదువాలనే ఆకాంక్ష పొడసూపు తుంది. అనువాద రచనలో ఈయన యే ఛందస్సును ఆలంబనంగా తీసుకోలేదు. నేటి సాధారణ జనులకు నిత్య సన్నిహిత వ్యవహారంలో భాషనే స్వీకరించారు. శ్రీ మూర్తి ప్రజాకవి. ప్రజలకు సునాయాసంగా అర్థ

మయ్యే భాషలో చెప్పడం ఆయనకు ఇష్టం; అయితే ఈయన కూర్చిన సరళ తరళ సుందర సుకుమార పదాల కూర్పులోని, కవితా పరమైన రసమాధు ర్యాన్ని వారి వారి అనుశీలనా సంపత్తిని బట్టి అర్థం చేసుకోగలరు. ఆనందించగలరు. అయితే ఒక్క విష యం మాత్రం ఖాయంగా చెప్పవచ్చు. ఈ కావ్యం చదివిన ప్రతి చదువరి ప్రతి ముక్తకంలో యెంతో కొంత రస విస్ఫూర్తిని, ఆనందపారవశ్యాన్ని పొంద గలడు—

రసపుష్టి కలిగిన "కావ్యం" వంటి అనేక కావ్యా లను వ్రాసిన శ్రీ కవిరాజ మూర్తిని, ఇందలి అజ్ఞాత కవుల్లాగనే అజ్ఞాతంగా వుంచడం ఈనాటి తెలుగు ప్రజలకు, తెలుగు ప్రభుతకు న్యాయం కాదు. రస సిద్ధుడైన ఈ సాహితీ మూర్తిని సముచిత రీతిలో గౌర వించడం ఇప్పటికైనా సమంజసమని మనవి చేస్తూ విరమిసున్నాను—

అనువాదం

కొలిపాక మధుసూదన్‌రావు.

# సాహిత్యగోష్ఠి

## బాల సాహిత్య స్రవంతి

బాలల ఆలోచనలు, వాళ్ళ అభిరుచులు, ఆశయాలు, వాళ్ళ భావి జీవిత గమనాన్ని, దేశ భవిష్యత్తును నిర్ణయిస్తాయి. వాళ్ళ జీవిత, దేశ భవిష్యత్తు నిర్మాణాత్మకంగా సాగాలంటే వాళ్ళ మనోవికాసాన్ని బాగా ప్రతిఫొందించాలి, అయితే మది మనోవికాసాన్ని ఏ విధంగా అభివృద్ధిచేయాలి అంటే వాళ్ళ ఆటపాటల్లోను, చదువు సంధ్యల్లోను వర్తమాన, భవిష్యత్తు విషయాల పట్ల శ్రద్ధను, వివేచనను కలిగించేట్లుగా ఉండాలి. దానిలో భాగంగానే బాల సాహిత్యాన్ని అభివృద్ధి చేయాలి. అంటే ఈ నిర్మాణాత్మకమైన ఆలోచనలు, ఆశలు, ఆశయాలు భావి తరాల వారికి బాటను చూపించ గలుగుతాయి,

బాల సాహిత్యంలో సరళాక్షర సంపదతో మృదు మధురంగా నీతి బోధకమైన కవితలు, దేశభక్తి, కళాదృష్టి, విమర్శనా దృష్టి కలిగేటట్లు వివిధ వ్యాస గద్యాలు వెలువడాలి ఇక ఈనాడు వైజ్ఞానిక విజ్ఞానంలో మరో గ్రహం మీదకు కాలు బెట్టిన విధానాన్నే, సహేతుకంగా హృదయంలో హత్తుకుపోయేట్లు. వాటి పట్ల శ్రద్ధను పంచుకొని జిజ్ఞాసతో ఆ యా విషయాలపై పఠన, పరిశోధనా విధానాన్ని అవలంబించేల్లా కృషిచేయాలి.

నేటి మన తెలుగు సాహిత్యంలో మాత్రం బాల సాహిత్యం ఇతర భాషల్లో మాదిరిగా అభివృద్ధి చెందలేదు. పోతే బాలగేయ సాహిత్యం, కథా సాహిత్యం కొంత మేరకు అభివృద్ధి చెందింది

చిన్న పిల్లల పాటలు ఇన్ని రకాలని చెప్పడానికి అలవికాదు. వాళ్ళ ఊహల వలె అవి అనంతం. ఈ పాటలు ఆ యా మాండలికాల ప్రభావాన్ని కలిగి వుంటాయి.

బిడ్డలను దొడ్డ వరాలుగా ఎంచి, వారిని కన్నందుకు తమ జన్మ ధన్యమైందని ఆనందించే మాతృ మూర్తుల భావాలు మల్లెల సౌరభాలు. మచ్చుకు.

లాభమ్మ లాభమ్మ ఏమి లాభమ్మ
కొడుకులను గంటేను కోటి లాభమ్మ.

కన్న కానుపులెల్ల కడుచక్కనైతే
కన్నుల పండుగే కన్నతల్లికిని :

నిద్ర నుండి బిడ్డను "మేలుకో నా తండ్రి మేలుకోవయ్య
మేలుకొని లోకాలు ఏలుకోవయ్యా"

అని లేపి "ఉః ఊః ఊగన్న ఉగ్గుపాలు ఇందన్న" అంటూ ఉగ్గు పెడుతుంది. పిమ్మట పాలిచ్చి ఊయల్లో పడుకోబెట్టి జోల పాటపాడుతుంటే అరమోడ్పు కన్నుల తన్మయత్వంతో నిద్రలోకి జారిపోతుంది బిడ్డ.

మృధుమధురంగా అతి సహజంగా సాగిపోయే జోల పాట చాలా ప్రసిద్ధమైనది.

జో అచ్యుతానంద ! జో ! జో ! ముకుందా !
లాలి పరమానంద ! రామ గోవిందా !

మరో పాట అందరికీ చిర పరిచితమైంది.

గోరంత దీపమ్మ కొండలకు వెలుగు
గోపాల కృష్ణమ్మ గోవులకు వెలుగు
మాడంత దీపమ్మ మేడలకు వెలుగు
మా చిన్న అబ్బాయి మా కళ్ళ వెలుగు .......

మరోసారి ఏడుస్తున్న బిడ్డని లాలిస్తూ పాడేపాట

ఏడవకు ఏడవకు వెర్రినా తండ్రి
ఏడిస్తే నీకళ్ళు నీలాలు కారు
నీలాలు కారితే నే చూడలేను
పాలైన కారవే బంగారు కళ్ళ !

పిల్లలు పెద్ద వాళ్ళయ్యాక తల్లి యవసరం లేకుండానే తామే ఆడుకోగలరు, పాడుకోగలరు. ఆడపిల్లలకు, మగ పిల్లలకు ప్రత్యేకమైన పాటలున్నాయి. ఉదహరణానికి "చెమ్మచెక్క చేరడేసి మొగ్గ" "తప్పట్లోయ్ తాళాలోయ్ దేవుని గళ్ళో బాజాలోయ్" మొదలయినవి. ఇంతేకాక పిల్లలు పరాచకాలు ఆడుతూ, నవ్వు పుట్టించే వరుస పాటలను పాడుతూ ఆనందిస్తారు. "బావా! బావా! పన్నీరు: బావను పట్టుక తన్నేరు.

ఈ బాల గేయాలలో వాస్తవేయత, స్వచ్ఛందత, అమాయకత కొట్ట వచ్చినట్లు కనబడుతుంది.

గ్రాంథిక భాషా పరిధుల్లోంచి బయటికి చొచ్చుకువచ్చాక వ్యావహారిక గేయాలైన గురజాడ అప్పారావు గారి విరచితమైనది. కరుణరసభరితం, దేశభక్తియుతమై ఇంకనూ సంస్కరణాయుతమైన ఆలోచనా పరిథులను కలిగించినవి ఉదాహరణకి,

దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా !
వట్టిమాటలు కట్టిపెట్టోయ్ !
గట్టిమేల్ తలపెట్టవోయ్ !
పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటు పడవోయ్ !
ఈసురో మని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్ !
దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్ !
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్ !
మనసులొకటై మనుషులుంటే
జాతియన్నది లేచి పెరిగీ
లోకమున రాణించునోయ్ !

ఈ భావాలు బాలల లేత హృదయాల్లోకి సూటిగా చొచ్చుకుపోయే గుణం గలవి.

శ్రీ వీరేశలింగం పంతులుగారు, శ్రీ వేలూరి శివరామ శాస్త్రి నాళం కృష్ణారావు గారు తెలుగు భాషపై మమకారం కలిగేలా తీయతీయనిమాటలతో పిల్లలకుఅందించారు.

ఒకసారి విన్నంతనే హృదయంలో చోటు చేసికునేది అంధ విశ్వాసాలను, సంఘ దురాచాలను ఎత్తిపొడిచే నీతి పద్యాలైన శతకాలు పిల్లలకు అర్థమవడం చాలా తేలిక. అలా తెలుగులో పేరెన్నిక గన్నవి ఎన్నో వున్నాయి. ఉదా: సుమతీ శతకం, వేమన శతకం, మొదలయినవి.

ఉప్పుకప్పురంబు ఒక్క పోలికనుండు
చూడ చూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా ॥
మాలవాని నేల మహిమీద నిందింప
బడలి రక్తమాంస మొకటి గాదె
వానిలోన మెలగువాని కులంబేది ?

ఇంకను బాల వాఙ్మయంలో కృషిచేసిన వారు శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి, గిడుగు వేంకట సీతాపతి మొదలయినవారు.

ఇతర రాష్ట్రాలలో పోల్చి చూసినా, లేదా ఇతర దేశాలలో పోల్చిచూసినా మన తెలుగులో పిల్లల పత్రికలు చాలా స్వల్పం. తెలుగులో వెలువడిన పిల్లల పత్రికలు —

1) బాల (1945) 2) చందమామ (1948 నుండి ఇంకా వస్తూనే ఉంది) 3) బాల బంధు 4) పాపాయి 5) బాబు 6) బాలమిత్ర 7) పొట్టిబావ 8) గుజ్జన గూళ్ళు 9) బొమ్మరిల్లు 10) పాలవెల్లి 11) కోకిల 12) బాలానందం (మాసపత్రిక) 13) బాలానందం (పక్షపత్రిక) 14) బాలప్రభ 15) బాలవినోదము 16) ఆనందబాల 1 ) హరివిల్లు.

వీటిలో చాలా మటుకు నేడు వెలువడుట లేదు.

1945లో 'బాల' పిల్లల పత్రిక మొట్ట మొదటి సారిగా వెలువడింది. దీనిని నిర్వహించినవారు — శ్రీ రాఘవరావు శ్రీమతి కామేశ్వరి గారలు.

ఇప్పటికీ ప్రత్యేక స్థానంలో ఉండిపోయినవి చందమామ బాలమిత్ర, బొమ్మరిల్లు మొదలగునవి.

నేడు వెలువడే చాలా పత్రికలలో బాలల కోసం కొన్ని శీర్షికలున్నాయి.

రేడియోలో కూడా బాలనందం అంటూ పిల్లల కోసం ప్రత్యేకమైన కార్యక్రమం నిర్వహించబడుతుంది.

ఇప్పుడు బాలసాహిత్య సృష్టి బాగా జరుగుతున్నది. అయినా ఇది చాలదు. బాల సాహిత్యం పిల్లలలో నిజాయితీ స్నేహ సౌశీల్యత, త్యాగ బుద్ధి, కార్యదీక్ష మొదలయిన వాటిని

పెంపొందించేలా వుండాలి. ముఖ్యంగా వైజ్ఞానిక బాల సాహిత్యాన్ని అభివృద్ధి చేయాలి. రాబిన్సన్ క్రూసో, స్వామి స్నేహితులు మొదలయినవి అనువాదాలే. అలాంటి గొప్ప నవలలు తెలుగు బాలసాహిత్యంలో ఇంతవరకు సృష్టించబడక పోవటం శోచనీయం. రచయితలు, రచయిత్రులు నేడు ఆధునిక నవలా రచనా వ్యాసంగంతో అందునా ప్రేమ సాహిత్యంలో మునిగి తేలుతున్నారు. కాని బాల సాహిత్యంలో ఏ మాత్రం శ్రద్ధ చూపెట్టడం లేదు. అన్ని సాహిత్యాలతో పాటు బాల సాహిత్యం కూడా అభివృద్ధి కావాలనే ఆశయంతో ఈ వ్యాసాన్ని ముగిస్తున్నాను.

సరిపల్లి అరుణాదేవి
2-4-1-ఎ/1
హాస్పిటల్ రోడ్, కరీంనగర్

# విశ్వనాథ వాఙ్మయం – మన తక్షణ కర్తవ్యం

సాహిత్య విమర్శలో విశ్వనాథవారి కొక విశిష్ట స్థానమున్నది. ఆయనకు "విమర్శక చక్రవర్తి" అను బిరుదున్నది కదా! నేటి విశ్వవిద్యాలయములలో ఈ దశాబ్దంలో ఎక్కువగా విశ్వనాథవారి జీవిత సాహిత్యాలపై పరిశోధన జరుగుచున్నది ఈ దృష్టితో పరిశోధన గ్రంథాలు కొన్ని ప్రచురింపబడినాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి డా॥ ఎన్. వి రామారావు గారు 'తెలుగులో సాహిత్య విమర్శ అవతరణ వికాసములు' అనే అంశంపై పరిశోధన చేసి డాక్టరేట్ డిగ్రీ పొందారు అందులో వీరు వికాసము'' అను ఆరవ ప్రకరణమున విశ్వనాథ వారిని గూర్చి ఒక ప్రత్యేక పరామర్శనే చేసినారు (1974) (చూ॥ పుటలు-150-168) వారి నిర్ణయమిట్లున్నది. "కట్టమంచి రామలింగారెడ్డితో ప్రారంభమైన కావ్యాత్మ విచారము విశ్వనాథ సత్యనారాయణతో పరిపూర్ణత్వమును సంతరించుకొనినది.' వీరి పరిశోధనకు మార్గదర్శకులుగా నున్న డా॥ పాటిబండ మాధవశర్మగారు ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా "తెలుగులో సాహిత్య విమర్శ'' అన్న చిన్న గ్రంథము వెలువరించిరి అందులో ఆయన "కవిత్వతత్త్వాన్ని యథార్థంగా దర్శించిన వారు విశ్వనాథ సత్యనారాయణ గారు... విశ్వనాథ వారి విమర్శల పరమార్థము భావుకులైన విద్వాంసులే గ్రహింపగలరు. సామాన్యులకు వానిని విపరించి చెప్పవలసియే ఉంటుంది. ఆయన కవిత యెంత ప్రౌఢమో విమర్శయు అంత ప్రౌఢము'' అని నిగ్గుదేల్చినారు. (చూ పుటలు 28-32, 1975)

వరంగల్, కాకతీయ విశ్వవిద్యాలయం నుండి మొదటి డాక్టరేట్ డిగ్రీ తీసుకొన్న డా॥ కోవెల సంపత్కుమారాచార్యుల వారు 1976లో "ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ – సాంప్రదాయికరీతి'' అనే అంశంపై పరిశోధన గ్రంథం రచించి 1981 లో ప్రచురించినారు. ఈ ఉదాత్త విమర్శ గ్రంథములో రెండు అధ్యాయములు (10, 11) విశ్వనాథ వారి విమర్శ ప్రస్థానంలోని మౌలిక తత్త్వాలను ఆవిష్కరిస్తూవుంది అవి 1) కావ్యపరమార్థ దృక్పథము, 2) జీవుని వేదన అనే రెండు అధ్యాయాలు కావ్యపరమార్థము, ఏక వాక్యత, కథాకథన శిల్పము ఇత్యాది మౌలిక విషయములు విశ్వనాథవారు విమర్శ ప్రస్థానములో గలవని నిరూపించుచు 'జీవుని వేదన'ను గూర్చి సాకల్యముగా చర్చించి, "భారతీయ దార్శనిక పరివేషములో సత్యనారాయణ గారు కావ్య మౌలిక హేతువుగా ప్రతిపాదించిన 'జీవుని వేదన' సాహిత్య విమర్శ మార్గమున వినూత్నము, విశిష్టమునైనది.'' అని సిద్ధాంతీకరించినారు.
(పుట – 259)

పురాతనులైన లాక్షణికులు సూచించి వదలివేసిన కథాకథన శిల్పాన్ని 'కల్పవృక్షం'లో ప్రపంచించి, తమ విమర్శ గ్రంథాలలో ప్రతిష్ఠించిన ఖ్యాతి విశ్వనాథ వారికి దక్కుతుంది. 'జీవుని వేదన' సర్వ భారతీయ సాహిత్య విమర్శనకే మకుటాయమానమై అన్వయిస్తుంది. 'సంపత్కుమార''గారి ఈరెండు అధ్యాయాలు అలంకారశాస్త్ర గ్రంథంలో తప్పని సరిగా చేర్చాలి. అంటే ఆ సాహిత్య విమర్శన సూత్రాలు అలంకార శాస్త్ర గ్రంథంలో రెండు ప్రత్యేక అధ్యాయాల క్రింద సూత్రీకరింపబడాలి.

ఇటీవల ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారు 'ఆంధ్ర సాహిత్య, విమర్శ – పాశ్చాత్య ప్రభావం' అనే శీర్షికకు పోటీ పెట్టారు. ఈపోటీ ఫలితంగా ఆవిర్భవించిన

గ్రంథాలలో డా. జి. వి సుబ్రహ్మణ్యం గారి గ్రంథం 'ఆంధ్ర సాహిత్య విమర్శ ఆంగ్ల ప్రభావం' యువభారతి వారు 1983 జనవరిలో ప్రచురించారు బహుమతి పొందిన గ్రంథం మిత్రుడు డా. బ్రహ్మానంద గారు వ్రాశారు. అది అముద్రితమైనందువల్ల పరిశీలించే అవకాశం లేకపోయింది. డా॥ సుబ్రహ్మణ్యం గారి గ్రంథం విశిష్టమైందిగా నేను భావిస్తున్నాను. ప్రకరణాలు- పర్యాలోచనం- వివేచనం అంతా ఉత్తమస్థాయిలో సాగింది. దీనికి వారు వ్రాసిన ప్రవేశిక' అమూల్యమైంది 'ప్రభావాలు— పరిధులు' అనే 6వ అధ్యాయంలో కొన్ని యుగాలుగా సాహిత్య విమర్శ ప్రభావ ప్రపంచాన్ని వర్గీకరిస్తూ ఆయన 'శిల్పానుశీలన యుగం— విశ్వనాథ' అన్న శీర్షికతో వ్రాసిన అధ్యాయం ప్రత్యేకించి పరిశీలింపదగింది అలాగే 'విశ్వనాథ-శేషే ద్ర అన్న 'శీర్షిక' క్రింది విషయాలు గమనించాలి (పుటలు 194—214)'' పాశ్చాత్యప్రభావాన్ని ఆలోచనకే పరిమితం చేయకుండా అనుభవరంగానికి తీసికొని వెళ్లి దేశీయం చేసి దివ్యంగా అభివ్యక్తీకరించే ప్రస్థానానికి ప్రాచార్యుడనిపించు కొన్నాడు. ...అసలాయన కున్న సంప్రదాయ బలమంతా పాశ్చాత్య విమర్శన రీతుల అవగాహనం మీద ఆధారపడి ఉందంటే అత్యుక్తికాదు; అతిశయోక్తికాదు. ఆయన విమర్శ ప్రవృత్తికి పాశ్చాత్య ప్రభావమే మూలబలం ప్రాచ్య సాహిత్య తత్త్వదర్శనం ప్రాణం' (పుట - 195)

"విశ్వనాథవారి విమర్శలో పాశ్చాత్య ప్రభావం అద్వైతం గానూ, శేషేంద్రశర్మగారి విమర్శలో విశిష్టాద్వైతం గానూ భావిస్తుంది." పుట-278

''సాహిత్య ప్రమాణాలతో సాహిత్యాన్ని అనుశీలించే ప్రామాణిక ప్రయోగ విమర్శను శిల్పానుశీలన విమర్శగా తెలుగులో వెలయించారు విశ్వనాథ వారు. ఈ మార్గంలో సాగుతున్న నేటి సాహిత్య విమర్శ అంతా విశ్వనాథలో గతార్థమౌతుంది. ఆయన ద్రష్ట ప్రయోక్త మిగిలినవారందరూ ఆ దర్శనం వెంట సాగిన ప్రయోక్తలు, ప్రసారకులు'' పుటలు—213—214

ఇటీవలనే ప్రచురింపబడిన డా॥ కోవెల సుప్రసన్నాచార్యులవారి సాహిత్యవ్యాస సంకలనం "సహృదయ చక్రము'' 'విశ్వనాథ-శేషేంద్ర' గార్లతర్వాత వారి విమర్శ మార్గాన్ని మరింత పటిష్ఠం చేయగల గ్రంథం 'షోడశ' వ్యాసాలున్న ఈ గ్రంథంలో అన్నీ దాదాపు శ్రీ విద్యా గంధిలమైనవే. సమన్వయ దృక్పథాన్ని స్థాపించేవే. నేడు వెలువడుతున్న అనేక సాహిత్య వ్యాస సంకలనాలన్నింటిలో ఈ గ్రంథం అత్యుత్తమమైనదిగా నేను పరిగణిస్తున్నాను వీరి 'సాహిత్యవివేచన' కూడా ఆధునిక తెలుగు సాహిత్య విమర్శలో గణనీయమైన గ్రంథం.

ఇంకా, విశ్వనాథ సాహిత్య విమర్శ ప్రస్థానాన్ని గూర్చి పరిశోధించే విమర్శకుల్లో డా॥ తుమ్మపూడికోటీశ్వరరావు డా॥ కేతవరపు వేంకటరమకోటి శాస్త్రిగారు ప్రముఖులు. డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు వీరిరువురికీ గురువులు, గురుతుల్యులు.

నేడు విశ్వవిద్యాలయాల్లో విశ్వనాథ సాహిత్య విమర్శను గూర్చి పరిశోధించే వారిలో విశ్వనాథ చారిత్రక కావ్యాలపై ఎం. ఫిల్. తీసుకొన్న శ్రీ పి. శివరామశర్మ "సాహిత్య విమర్శకుడుగా విశ్వనాథ'' అనే అంశంపై పరిశోధిస్తున్నారు. ''కల్పవృక్షంపై ఆధ్యాత్మ రామాయణ ప్రభావం'' అనే అంశంపై వారణాసి భిక్షమయ్య పరిశోధిస్తున్నారు. విశ్వనాథ చిన్నకథల పై ఎం. ఫిల్. డిగ్రీతీసుకొన్నారు. శ్రీ దివాకర్ అనే మిత్రుడు అనంతపురం నుండి ఇలా యింకా ఎందరో విశ్వనాథ పై ఉత్సాహంగా పరిశోధనలు కొనసాగిస్తున్న వారుండవచ్చు. భవితవ్యంలో ఆ మహాకవి అభిప్రాయాలు సాహిత్యంలోనే కాక మానవ జీవితంలో గూడా త్రికరణశుద్ధిగా ఆచరణలోకి వస్తుందని ఆశిస్తున్నాను.

ముదివేడు ప్రభాకరరావు
తిరుపతి

# సమ్యక్ భావ ప్రదర్శిని 'సమదర్శనం'

ఈ ఖండకావ్యమును ఇటీవల పఠించినపుడు ఒక సమీక్షావ్యాసం రాయాలని తోచి ఈ చిన్నప్రయత్నం చేసాను. ముందుమాటలో కృతికర్త నారాయణరెడ్డి గారే ఇట్లా చెప్పుకున్నారు— 'సమకాలీన సమాజం లోని మంచి చెడులను చాలా వరకు మెత్తగా ఎత్తిచూపడం, ఒక్కొక్కప్పుడు పొడిచి హెచ్చరించడం ఈ సంపుటిలో కనిపిస్తున్నది.' 'జీవితసత్యాలను సూటిగా చెప్పేటప్పుడు కవిత్వగుణం వెనక్కితగ్గక తప్పదు" అని

ఇందులో రాజకీయం యొక్క విశిష్టత, సమసమాజమును గూర్చిన వివరణ, సత్త్వగుణ సమాదరణీయత, త్యాగగుణ నైజరూపము, ద్వేషగుణవిముఖత, గతాధునికతా సమన్వయ సంప్రదాయము, స్తుతివలన కలుగుమేళ్ళు, కీళ్ళు, సంస్కృతి తీరుతెన్నులు రచనా వ్యాసంగమునకు 'వేదన' గల సంబంధము ఇట్లేవిభిన్న సుమభావాలు 'సమదర్శనా' సూత్రమునకు మాలగా అల్లబడినాయి. ఇప్పుడు ఒక్కొక్కవిషయాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నిద్దాం.

పూర్వం సమాజానికి మతం ఆయువు పట్టయితే నేడు రాజకీయం ఆస్థానాన్ని ఆక్రమించింది. సంఘమనే మట్టి దివ్వెకు రాజనీతి చమురు వంటిది. మనిషి బట్టగట్టిన మరు నిమిషము నుండే రాజనీతి సమాజనాటకరంగం మీదికి వచ్చింది. ఇట్టి రాజనీతి శుక్రాచార్యుడు, చాణక చూపిన వింతలు ఎల్లకాలముమనిషి మేధలో ఇల్లు కట్టుకొని కూర్చున్నవని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతారు.

సమసమాజము కుసుమించ వలెనంటె రాజనీతికి నీతి ఊతగా ఉండాలి. సమసమాజం అంటే గడ్డపార బట్టి నేలను కలయద్రవ్వి మిట్టపల్లాల్ని సమానం చేయడంకాదు. మనుష్యుల గుండె లోపలి ఎత్తువంతల కూడగలిపితే సమ సమాజము అని.

రెక్కలను ముక్కలుగ జేయుచు
రేబవళ్ళు శ్రమించు వారికి
తగిన ప్రతిఫల మందినపుడే
యిగురువెట్టును సమసమాజము.

అని అన్నది గమనించదగ్గ విషయం.

త్యాగభావము పూవులోని తావిమాదిరిగా త్యాగధనులకు సహజమైనది, అటువంటి త్యాగభావమును స్వభావ సహజము కాని వాళ్ళు పులుముకోవడం పులిని చూసి నక్క వాతలు పెట్టుకోవడం. ఐతేత్యాగమూర్తులు ఏయుగంలోనైనా ఆనాటి సమాజం వల్ల హింసింపబడతారు యిది తప్పదని ఉద్ఘాటిస్తూ యేసుక్రీస్తు, సోక్రటీసు ఉదాహరింపబడినారు. అంతదాకా యెందుకు యింతగా విజ్ఞానశాస్త్రం ఆకాశంపై పచార్లుచేస్తున్న కాలంలో మహాత్మాగాంధి మరణం 'భరతజాతి నుదుట నెత్తురుచారిక' అంటారు.

త్యాగభావం అట్లుండగా ద్వేషభావం యిట్లా చెప్పబడింది. తేలుకు కొండిలోని విషంవలె అల్పబుద్ధులకు ద్వేషము అట్టిది. ద్వేష చిత్తులకు ఎప్పుడూ రంధ్రాన్వేషణమేగాని మరొకపని ఉండదు. ఐతే స్థితప్రజ్ఞుడూ, కర్మ, వీరుడూ అయినవాడు భద్రగజము వలెనూ, తమోమేఘ విదూరితభాస్కరుని వలెనూ సఫలీకృతుడవుతాడు

కావ్యం అంతటా వేమన్న పద్యాలవలె రచయిత ఆవేదన వ్యక్తమవుతుంది. 'నిన్న' పైతనకున్న ప్రేమ వాస్తవమేకాని 'నేటి' పై లేదనడం మసిపూసే తర్కం. గతమేమంచిదని కొందరు, వర్తమానమే మంచిదని మరి కొందరు అటూ యిటూ వాదులాడుతూండగా అంతమంది లోనే గతమనేకట్టడంపైన వర్తమానమనే గోపురం నిర్మింపబడిందనీ, పాలపై మీగడవలె గతంలోపల మిగిలే మంచే సంప్రదాయం అని తేల్చివేస్తారు. కొత్తనీటిని చేర్చుకొని పగెరిత్తేనదివలె ఏజాతి అయినా ముందుకు ఏగినంతకాలం మూడుపూవులు ఆరుకాయలు అనికూడా ప్రపచిస్తారు

ఎటువంటి వారికైనా సహనముబట్టి విలువ పెరుగుతుందంటూ 'సహనమే సంస్కృతి' అన్నరాధా కృష్ణ పండితుని సూక్తిని ఉదాహరిస్తారు పొట్టనింపు కోవడమే కాకుండా ప్రతిమనిషికి పరమలక్ష్యం ఒకటి ఉండాలి కానిచో గానుగెద్దు గొప్పది. పశుహృదయుడైన ప్రభువు కంటే శిశుహృదయుడైన సేవకుడు పూజ్యుడు. చేపపిల్లకీత ఎంతసహజమో సజ్జనులకు సంస్కృతి పుట్టుకతోనే అలవడుతుంది సంస్కారమును బట్టి మనిషికి వినయ సంపద కలుగుతుంది. మోడువంగనట్లు కొంచెపు మనుష్యులకు వినయగుణ మలవడదు. పూవుకు తావి అబ్బినట్లుగా సంస్కారమునకు అనుభవసంపద నిగ్గులు తీర్చుతుంది.

ముఖస్తుతి నిప్పువంటి మనిషినైనా నీరుగాచేసే సమ్మోహనాస్త్రం. ఇట్టిముఖస్తుతిని కొందరు విషతుల్యమని తలచగా పరిణతాత్ములు భవిష్యత్ ప్రగతికి చూపుడు వేలని భావించుతారు. కణ మాత్రమైనా కీర్తి కాంక్షలేని

మానవుడు నూటికి కోటికి ఏఒకరో అంటాడు. పేరుకొరకు సభ్యత పొలిమేరలు దాటడం ప్రమాదం. తనసంస్కారము సత్ ప్రవర్తనను బట్టి తన యంతటతానే వస్తే కీర్తిని తల దాల్చాలి అంటారు. ముక్కు గుద్దినట్లు చెప్పడం గట్టిచిక్కు అనీ, ఎటువంటి మాటకు అటువంటి మాట ప్రయోగిస్తే అందరూ సంతోషిస్తారంటూ ముల్లుతోడ ముల్లు దీయాలనే ఉపమానం కల్పిస్తారు మెత్తగా మాట్లాడుతూ కత్తులునూరే వాళ్ళకంటే 'దురుసుగాపల్కెడు వెన్న మనసువాడు మిన్న తప్పించుకు తిరిగే స్వార్థపరత్వంకంటె మంచోచెడోనమ్మిన మాట అనటమేమంచిదంటారు.

వేదనలేని బ్రతుకు దూదికంటే తేలిక. వేదనలోనే వేదాలునాదాలు పుట్టాయి గుండెకు గండిబడినప్పుడే గొప్ప కవిత్వం వస్తుంది అట్లా వచ్చిందే వేదన కక్షర రూప మయిన ఆదికావ్యం రామాయణం.

బాధపడిన హృదయమ్మె
పలికించును పరమాత్మను
పెల్లిగిలిన కొండ్రలోనే
పల్లవించు పసిడిపంట

అన్న పద్యం ఈ కావ్యానికి మణికిరీటం, కలకాలం తేనెతేనెగా బ్రతకడం వల్ల మనసు బరువెక్కుతుంది కావున బాధాగ్ని అప్పుడప్పుడంటడం మంచిదంటారు ఐతే అట్టి బాధల్ని గోవు గడ్డి మేసి క్షీరం కాన్కవెట్టినట్లుగా మంచి వారు బాధల్ని కబళించి సౌఖ్యం అందిస్తారు.

ఉపన్యాసము గూర్చి చెప్తూ సారమున్న ఉపన్యాసము మాత్రమే సభాసదులకు పచ్చని ఊహల్ని రేపుతుందిగాని పదాల గారడిగల వట్టి ఊపు పాలపొంగు వంటిదంటారు.

ఇట్లా కావ్యంనిండా తన 'గుండియ జుమ్మని స్పందనము పొందినప్పుడెల్ల వెలికుబికిన' యువభావాలు ఒక్కమొగిన సాగినాయి.

పాటి దశరథ రెడ్డి ఎం. ఏ.,

*సూచన గతసంచిక సాహిత్యగోష్ఠిలో ప్రకటించబడిన తూర్పు వాకిళ్ళు – ఒక పరిశీలన అను వ్యాస రచయిత శ్రీ జానగాని కాటమయ్య. ఎం. ఏ. అనంతపురం అని గమనించవలెను.*

**సంపాదకుడు**

# శ్రద్ధాంజలి

ప్రత్తిపాడు హిందీ ప్రేమీమండలి సలహాదారుగా వుండి మండలి కార్య క్రమాల్ని విజయవంతంగా నడిపిస్తూయున్న ఆంధ్ర సభ సాధారణసభ్యులు శ్రీ సి. రాజగోపాలాచార్యులు గారు దివంగతులైనారని తెలుపుటకు విచారిస్తున్నాము. వారి ఆత్మకు శాంతి ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాము.

సంపాదకుడు

# పాఠకుల లేఖలు - అభిప్రాయాలు

ఆర్యా,

సెప్టెంబరు నెల స్రవంతిసంచికలో జె. విజయలక్ష్మి గారు "కడపజిల్లాలోని కొన్ని మాండలికములు" ను ప్రకటించినారు. అందు కొన్ని కడపజిల్లాలో వాడుకలో లేవు. కొన్ని కొంత భేదముతో కన్పించుచున్నవి. పాఠకులు ఈ వ్యాసాన్ని చూచి పొరబడే అవకాశం వున్నది ఆ పొరపాట్లను సరిదిద్దడమే నాధ్యేయం. జె. విజయలక్ష్మిగారిని కించపరచే ఉద్దేశం మాత్రంకాదు.

3. బేడలు = పప్పులు.

"కడపజిల్లాలో ఏ పప్పునయినా బేడలు అంటారు"— రచయిత్రి అలాఅనరు. కంది బేడలు, పెసరబేడలు, శనగబేడలు. మినపబేడలు యిలా వుంటుంది వ్యవహారంలో. బేడ = రెండు దళములుగల గింజ చీల్చగా విడిపోయిన భాగం,

6. తేగలు— నెల్లూరు జిల్లామాండలికము.

7. పోళీలు = బొబ్బట్లు— ఇదిహోళిగ అను కన్నడపదమునుండి పుట్టినది

8. పోళీలు:— ఈ మాట చాల తక్కువగా విన్పించును, ఎక్కువగా "ఓలిగలు" అను పదము సర్వత్ర విన్పించును.

9. "పెన్నము లేదా పెనము" ఇది యీజిల్లా వ్యావహారికము." దోశరేకు అనుట ఎచ్చటను విన్పించదు.

11. "లొడిగ"— "లడిగె" గా వ్యవహరిస్తారు.

13. "చిత్త"— "చిత్తి" గా వ్యవహారములో నున్నది,

14. "పుల్ల" = కుంకుడు పులుసు = పుల్ల అను పదము కుంకుడు పులుసుకు వాడరు. రచయిత్రి గారు వ్రాసిన రెండవ అర్థం "కట్టముక్క" సరియైనదే

22. "అబ్బ" = కుమారుడు అన్నారు రచయిత్రి. అది సరికాదు. తండ్రి తండ్రిని "అబ్బ" అంటారు, కుమారునికి యీవాడుక లేదు. అబ్బి సరియగు రూపము.

24. జంపర్ = జాకెట్— ఈ పదం కడపజిల్లా మొత్తముపై సామాన్య జనం ఎవరూ ఊహింపరానిదిగా ఉన్నది.

సవరిస్తే పాఠకులు గ్రహించగలరు. ఉపేక్షిస్తే చేసేదేమున్నది? రచయిత్రి ధైర్యంగా మరికొన్ని మాండలికములను ప్రకటింపగల రని కోరుచున్నాను. పునఃవందనములు.

ఇట్లు,
విధేయిని,

దొమ్మరనంద్యాల — కె. స్వర్ణలత

4-10-83




## తొలి రేఖలు

రచన-బీరం సుందరరావు

వెల రూ. 5=00

ప్రతులకు—నవోదయ పబ్లిషర్స్
ఏలూరు రోడ్ విజయవాడ-2

ఈనాడు యువ కవులెందరో ఉత్సాహంతో, ఉత్తేజంతో, సామాజికమైన అవగాహనతో కవితా రచన చేస్తూ కవితా సంపుటాలను ప్రకటిస్తున్నారు. ఇది మంచి పరిణామమే అనుకోవాలి ఐతే ఇవి కవితాత్మను ప్రదర్శిస్తున్నాయా? అని ప్రశ్నిస్తే సరైన సమాధానం కష్టమే. నేడు విరివిగా వస్తున్న కవితా సంపుటాల్లో ఇదొకటి. కవి విద్యావంతుడైన యువకుడు. ఉత్తమ లక్ష్యంతో కవిత వ్రాయాలనే తపన కలవాడు. "కవిత్వం రాయాలనే పట్టుదలతో కాకుండా, కవితావేశం ఎదలోయల్లో పొంగినపుడే కలంపట్టాను. కళ్ళతో చూస్తున్న వాస్తవాన్ని కలంతో రాస్తున్నాను. వాస్తవాన్ని చెప్పదలచుకొన్నపుడు కవిత్వంలో ధ్వని పనికిరాదని నా అభిప్రాయం" అని కవి మనవి చేసుకున్నాడు. యీ చెప్పడాన్ని బట్టి కవి ఆశయం విశదమౌతున్నది. అందుకే డా. దాశరథి "ఈ యువకవికి నిరాశలు, నిస్పృహలులేవు. భావాన్ని సూటిగా చెప్పడం లక్ష్యంగా పెట్టుకున్నాడు" అని చెప్పడం జరిగింది. అందువల్ల సుందరరావు కవితలో వాస్తవికత, స్పష్టత, సారళ్యం చక్కగా ప్రకటింపబడినాయి. తాను కవితను దేని కొరకు వ్రాస్తున్నాడో కవి ఇట్లా చెప్పాడు.

"నేను వ్రాస్తున్నాను కవితను
సమాజంలో కుళ్ళుకడగటానికి
ప్రజల కళ్ళు తెరిపించడానికి
మేల్కొన్న జనాన్ని
ముందుకు నడిపించడానికి"

ఇంకా ప్రజా కవిత్వం వ్రాస్తాననీ, రుజాగ్రస్త సమాజాన్ని రూపుమాపి, క్రొత్తరూపు ఇస్తాననీ చాటి చెప్తున్నాడు కవి. బుద్ధుడు పుట్టిన దేశంలోని రాజకీయపు గుద్దులాటలను, పదవులకై సాగించే కుమ్ములాటలను, పన్నుల భారం, కన్నుల కారం, నాయకుల పదవుల బేరం మొదలైన ఘోరాలను నిరసిస్తున్నాడు ఈ యువకవి. దాశరథిగారే కాక డా. పురిపండా, సోమసుందర్, టి. యల్. కాంతారావు, ఎల్లోరా, యస్వీ జోగారావుగారలు సుందరరావు కవితను గూర్చి సదభిప్రాయాలు తెలిపారు.

—వేముగంటి

# వార్తావాహిని

## ప్రమాణ పత్ర వితరణోత్సవము. పామిడి

ద. భా. హిందీ ప్రచార సభ, ఆంధ్ర హైదరాబాద్ వారిచే గత ఫిబ్రవరి 83లో నిర్వహింపబడిన ప్రారంభిక పరీక్షా ప్రమాణపత్ర వితరణోత్సవము 11-9-83న కళాశాల ప్రాంగణమందు జరుపబడినది.

చి॥ సుజాత, లక్ష్మిదేవిలచే ప్రార్థన జరుపబడెను. తర్వాత హిందీ ప్రచారకులు శ్రీ ఏ బి. ఉమాశంకర్ అతిథులకు స్వాగతము పలుకుచూ ఈ కేంద్రములో జరుపబడుచున్న హిందీ ప్రచారకృషిని వివరించిరి.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ వి. సుబ్బారెడ్డి ఏమ్. ఏ, మేనేజర్, (అనంత గ్రామీణ బ్యాంకు, పామిడి,) గారు తమ ప్రసంగంలో, భారత దేశ సమైక్యతకు తోడ్పడు విధంగా జాతీయ భాషాభ్యసమును గావింపవలెనని విద్యార్థులకు వివరించిరి. అధ్యక్షుల వారిచే ప్రమాణపత్ర వితరణ గావింపబడెను

ముఖ్య అతిథులైన శ్రీ వసంతరాజు ఎమ్ ఏ. బిఇడి, ప్రధానాచార్యులు, (శ్రీ సరస్వతీ విద్యా మందిరం, పామిడి) గారు తమ ఉపన్యాసంలో పాచీన భాష అయిన సంస్కృతానికి, ఆధునిక జాతీయ భాష అయిన హిందీకి గల అవినాభావ సంబంధమును, హిందీ భాష సాహిత్య విశిష్టతను, సౌలభ్యమును వివరించిరి జాతీయ భాష ప్రచారమునకు హిందీ ప్రచార సభ యొనర్చుచున్న కృషిని, ప్రచారకుల సేవను ప్రశంసించిరి.

హిందీ ప్రచారకులచే వందన సమర్పణ తర్వాత జాతీయ గీతంతో సభ ముగిసెను.

## ప్రమాణపత్ర వితరణోత్సవము, మొవ్వ

ది. 2-9-83 సాయంత్రం 5-00గం॥లకు మొవ్వ శ్రీ హనుమాన్ హిందీ విద్యాలయమునందు ప్రార్థనా గీతముతో సభ ప్రారంభమైనది. సభకు మొవ్వ గ్రామ పంచాయితీ అధ్యక్షులు శ్రీ మండవ జానకి రామయ్య గారు అధ్యక్షత వహించిరి సభలో ఉపన్యాసకులుగా మొవ్వ జిల్లా పరిషత్ హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ తాతినేని రామదాసుగారు, హైస్కూలు పండిట్ శ్రీమతి వి. జయశ్రీగారు జూనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ శ్రీ పాండురంగారావు గారు మొదలగు వారు పాల్గొనిరి.

మొదట విద్యాలయ ప్రధానోపాధ్యాయులు శ్రీ కె.ఆర్. కె. శర్మ విద్యాలయ పురోభివృద్ధిని గురించి చెప్పిరి. పెద్దల ఉపన్యాసముల తర్వాత అధ్యక్షులు శ్రీ మండవ జానకి రామయ్యగారు 1983 ఫిబ్రవరి పరీక్షలకు ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష, ప్రవేశికలలో ఉత్తీర్ణులైన విద్యార్థినీ-విద్యార్థులకు ప్రమాణ పత్రములు పంచి పెట్టిరి.

తర్వాత శ్రీ కె. ఆర్. కె. శర్మ 6వ హిందీ పరీక్షార్థుల మేలా-మొవ్వలో పాల్గొనిన చల్లపల్లి హిందీ ప్రచారకులు శ్రీ ఉప్పాల వెంకటేశ్వర్లు గారి శిష్యుడు చి॥ వేమూరి రవి కుమార్ రాష్ట్రభాష పరీక్షనందు ఆంధ్ర ప్రాంతములో సర్వద్వితీయ స్థానము పొంది

నందుకుగాను బహుమానము నిచ్చి వానిని ఇంకనూ పురోభివృద్ధి నొందవలెనని ఆశీర్వదించిరి. తదనంతరము సభికులెల్లరు తేనీటి విందు కార్యక్రమములో పాల్గొనిరి.

## హిందీ మహా విద్యాలయము, గాంధీ పర్వతము విజయవాడ-1

11-9-88, ఆదివారం సాయంకాలం, గాంధీ పర్వత సంస్థ హిందీ మహా విద్యాలయములో, ఆచార్య వినోబాభావేగారి 89వ జయంతి ఉత్సవము జరుపబడినది ప్రముఖ వైద్యులు ఆచార్య శ్రీ కొలిపాక ఆదినారాయణ శర్మగారు సభకు అధ్యక్షత వహించారు. విద్యాలయ విద్యార్థినీ-విద్యార్థులు సామూహిక సర్వమత సమన్వయ ప్రార్థన చేసిన తరువాత విద్యాలయ ప్రధాన అధ్యాపకులు శ్రీ చర్ల జనార్దన స్వామి గారు స్వాగతము పల్కి అధ్యక్షులను సభకు పరిచయము చేసిరి.

వినోబా ఆశ్రమవాసినిగా పాద యాత్రకురాలుగా పాల్గొన్న హిందీ ప్రచారకురాలు శ్రీమతి చాపరాల ఝాన్సీ లక్ష్మీబాయిగారు, వినోబాజీ ఆశ్రమములో జరిగిన 'కాంచన ముక్తి' ప్రయోగాన్ని గురించి, వినోబాజీ పాదయాత్ర విశేషములను గురించి తమ అనుభవాలను వివరిస్తూ ఉపన్యసించారు. శ్రీమతి చర్ల బాపాయమ్మగారు వినోబాజీ స్త్రీలలో ఆధ్యాత్మిక చైతన్యాన్ని జాగృతము చేయడానికి చేసిన కృషిని గురించి ఉపన్యసించారు. గాంధీ పర్వత సంస్థ సంయుక్త కార్యదర్శి డాక్టర్ ఐ. యస్. ఆర్. మూర్తి గారు విద్యార్థులు క్రమశిక్షణతో మెలుగుతూ గాంధీ వినోబాల ఆదర్శాలను ఆచరణలో పెట్టాలని ప్రబోధించారు. 1988 ఫిబ్రవరి నెలలో జరిగిన ప్రాథమిక, మధ్యమ రాష్ట్రభాష, ప్రవేశిక, పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యాలయ విద్యార్థులకు అధ్యక్షులు ప్రమాణ పత్రములను, అందజేసారు. స్వాతంత్ర్య దినోత్సవ సందర్భములో, 15-8-88వ తేదీన విద్యాలయములో నిర్వహించబడిన క్విజ్ పోటీ, ఉపన్యాసముల పోటీలలో, గెల్పొందిన వారికి శ్రీమతి ఝాన్సీ లక్ష్మీబాయి గారు బహుమతి వితరణ చేసారు. విద్యాలయ ఉపాధ్యాయిని శ్రీమతి ఏ. విజయలక్ష్మిగారి వందనసమర్పణ అనంతరము జనగణమన గీతముతో సభ సమాప్తం అయినది.

## ప్రమాణ పత్ర వితరణోత్సవము, పొత్తపి (కడపజిల్లా)

ది. 16-9-88 సాయంకాలము 4గం॥ 12ని॥లకు పెనగలూరు కేంద్రములో దక్షిణ భారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర) వారు 1988 ఫిబ్రవరిలో నిర్వహించిన హిందీ ప్రారంభిక పరీక్షలలో ఉత్తీర్ణులైన పరీక్షార్థులకు ప్రమాణ పత్ర వితరణోత్సవము పొత్తపి ప్రాథమికోన్నత పాఠశాలయందు వైభవోపేతంగా జరిగినది.

సభకు స్థానిక గ్రామ సర్పంచ్ శ్రీ బి. నారాయణ రెడ్డిగారు అధ్యక్షత వహించిరి. చి॥ ఎమ్ శ్రీకుమారి, చి॥ వై. రాజేశ్వరిల ప్రార్థనా గీతముతో సభ ప్రారంభమైనది. అధ్యక్షుల వారు తమ తొలిపలుకులలో హిందీ భాష ఎంతేని అవసరమని తెల్పిరి. శ్రీ వై. శంకరయ్య ఎమ్. ఏ. (బిఇడి) గారు, శ్రీ యన్. నారయ్య టీచరు గారు, హిందీ భాషా ప్రాముఖ్యతను గూర్చి తెలుపుతూ మరింత ఎక్కువ సంఖ్యలో సభ వారి పరీక్షలలో కూర్చోవాలని తెలిపిరి. స్థానిక హిందీ ప్రచారకులు శ్రీ వి.పుల్లయ్యగారు తను 6సం॥ల నుండి

చేయుచున్న హిందీ ప్రచారమును గూర్చి వివరిస్తూ, సభ పుట్టుకను, సాధించిన అభివృద్ధిని తెలియబరిచిరి. ఉపాధ్యాయ ఫెడరేషన్ సెక్రటరీ శ్రీ ఏ. సుబ్బయ్య గారు మాట్లాడుతూ అందరూ హిందీ నేర్వాలని హితవు జెప్పిరి.

స్థానిక పాఠశాల ప్రాధానోపాధ్యాయులు శ్రీ వి. సూర్యనారాయణరావుగారు తమ ఉపన్యాసములో శ్రీ వి పుల్లయ్యగారు చేయుచున్న నిస్వార్థ భాషా సేవను ప్రశంసిస్తూ వారికి ఉజ్వల భవిష్యత్తును ఆ భగవంతుడు ప్రసాదించాలని కోరిరి. అధ్యక్షుల వారు పిల్లలకు ప్రమాణ పత్రములను బహూకరించిరి. తదుపరి చి॥ ఏ. చంద్రమోహన్, చి॥ వై. మనోహర్‌లు తమ తమ ఏకపాత్రాభినయములతో సభికులను ఆనంద పరిచిరి.

సభకు విచ్చేసి సభను జయప్రదము గావించిన సభా సదులందరికి హిందీ పండితులు శ్రీ వి. పుల్లయ్య గారు ధన్యవాదము లర్పించిరి.

"జన. గణ. మన" జాతీయ గీతాలాపనతో సభ ముగిసినది.

---

డా॥ పి. అప్పల రాజుగారు హిందీలో రచించిన 'సుమిత్రా నందన పంత్ మరియు కృష్ణశాస్త్రి గారల కావ్య సాహిత్యాల తులనాత్మక పరిశీలనము' అను హిందీ గ్రంథానికి బీహార్ ప్రభుత్వం వారు రు. 5000-00లు యిచ్చి సత్కరించారు. శ్రీ రాజు గారు ఆంధ్ర విశ్వవిద్యాలయ హిందీ శాఖలో రీడరుగా పనిచేస్తున్నారు. శ్రీ రాజుగారు హిందీ తెలుగుభాషల్లో మంచి రచయితగా కీర్తిగడించారు. సాధుస్వభావంగల సజ్జనులు. ॥సంపాదకుడు॥



## శ్రీనగర్ బహిరంగ సభలో

## ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుగారి హిందీ ఉపన్యాసం---

ది. 6-10-1983 సాయంత్రం శ్రీనగర్‌లో జరిగిన పెద్దబహిరంగసభలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావుగారు ప్రప్రథమంగా హిందీలో మహోద్రిక్తంగా ప్రసంగించి అక్కడి ప్రజల మన్ననలనందుకొన్నారు. ముందుగా రెండు వాక్యాలు తెలుగులోను, పది వాక్యాలు ఇంగ్లీషులోను, ఆ తరువాత 30 నిమిషాలు హిందీలోను అనర్గళంగా ప్రసంగించి త్రిభాషా సూత్రాన్ని అమలు బరిచారు. ఇంగ్లీషు ఉపన్యాసాన్ని కాశ్మీరీ భాషలోనికి అనువాదకులు అనువదించారు. శ్రీ రామారావుగారు హిందీ ఉపన్యాసం ప్రారంభించేసరికి జనం ఆశ్చర్యంతో ఉక్కిరి బిక్కిరై కరతాళ ధ్వనులతో స్వాగతం చెప్పారు. తెలుగులోవలెనే హిందీ ఉపన్యాసంకూడా మహోద్ధృతంగాను, అవసరమైన ఆరోహణ, అవరోహణలతోను సాగినందున వారి ప్రతి హిందీ మాటకు లక్షలాది ప్రజల రెస్పాన్సు బ్రహ్మాండంగా లభించింది. వాక్య వాక్యానికి కరతాళ ధ్వనులు మిన్నుముట్టడం వల్ల ఆగి ఆగి వారు ప్రసంగించవలసి వచ్చింది.

తెలుగు సామెత అంగట్లో అన్నీ వున్నాయి. కాని అల్లుడి నోట్లో శని వున్నదని సొంతలాభం కొంత మానుక పొరుగు వారికి తోడుపడవోయ్ దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్ అనుగురజాడ కవితను చదివి, హిందీలోకి అనువదించినప్పుడు, ఇక్బాల్ శేకభక్తికవితల్ని హిందీలో వినిపించినప్పుడు ప్రజల కరతాళధ్వనుల కోలాహలం అవధుల్ని దాటిపోవడం విశేషం.

జై తెలుగునాడు, జైహింద్ అని అంటూ శ్రీరామారావుగారు తమ హిందీ ప్రసంగం ముగించిన తరువాత కనీసం అయిదారు నిమిషాల పాటు ఎన్. టి. ఆర్. జిందాబాద్, తెలుగు దేశం జిందాబాద్ అను నినాదాలు ఆ బహిరంగ సభలో మార్మోగిపోయాయి.

శ్రీ ఎన్. టి. రామారావుగారి ప్రథమ హిందీ ఉపన్యాసం విజయవంతం అయినందుకు సంతోషిస్తున్నాము. ఉత్తర భారత దేశ విజయ యాత్రకు, శ్రీనగర్ బహిరంగసభలో వారి హిందీ ఉపన్యాసం నాంది అవుతుందని, కావాలని ఆశిస్తున్నాము.

—సంపాదకుడు

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర, హైదరాబాదు

## స్వర్ణ జయంతి పరిచయ పరీక్ష

పరీక్షార్థుల పట్టిక, పరీక్షా రుసుము అంగీకరించు చివరి తేది — 20-10-1983

పరీక్ష జరుగు తేదీ. ది, 20 నవంబరు 1983

పరిచయ పరీక్ష వివరాలు ప్రచారకులందరికీ పంపించాము. పరీక్షా రుసుము పంపినవారందరికీ పరిచయ పుస్తకాలు పంపించాము. యీ మధ్య వచ్చిన వరదలవల్ల, విపరీతమైన వర్షాల వల్ల లారీ ట్రాన్సుపోర్టు ద్వారా పంపబడిన పరిచయ పుస్తకాలు అందుటకు కొద్ది సమయం పట్టవచ్చును. పరీక్ష మాత్రం నవంబరు 20 వ తేదీన తప్పక జరుగును. హిందీ పండితులు చాలా ఉత్సాహంతో పరిచయ పరీక్ష కార్యక్రమాన్ని విజయవంతం చేయుటకు పూనుకొన్నందుకు సంతోషిస్తున్నాము. ప్రథమంగా జరుగుతున్న యీ పరీక్ష 300 మంది పరీక్షార్థులకు శిక్షణ నొసంగి పరీక్షలకు పంపుతున్న హిందీ పండితులను, ముఖ్యంగా సోదరీమణులను అభినందిస్తున్నాము. అట్టివారి పేర్లు సుపూర్ణకుంభ్, స్రవంతి పత్రికలలో యికనుంచి ప్రకటిస్తామని మనవి చేస్తున్నాము.

హైదరాబాదు — వేమూరి రాధాకృష్ణమూర్తి
ది.20-10-1983 కార్యదర్శి

Edited, Printed and Published by V. Radhakrishna Murty, on behalf of the D. B. Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshina Bharat Press, Hyderabad-500 004.